# సాధు యోసేపుగారి

# దైవ పిలుపు

రచయిత:

సాధు యోసేపు



1960

[వెల 75 న. పై.

# FOREWORD

Sadhu Joseph has been greatly used of God in his ministry of teaching and healing in many parts of this Diocese. His life of prayer and his fellowship with God and His Church have brought new spiritual quickening and rich blessing to many. I commend him and his work to the prayers and support of all members and ministesr.

**Frank Whittaker,**
Bishop in Medak.
26 –6—1959.

Isaiah 49 : 6.

# సాధు యోసేపుగారు

మెదకు అధ్యక్షమండల మందలి చాల ప్రాంతములందు దేవుని వాక్య పరిచర్యయందును, రోగులను కుదుర్చు పరిచర్యయందును సాధు యోసేపుగారిని దేవుడత్యధికముగ నాశీర్వదించి, యద్భుతముగా వాడుకొనుచున్నాడు, దేవునియందలియు, దేవుని సంఘమందలియు తన సామీప్య సహవాస జీవితమును, తన ప్రార్థన జీవితమును అనేకులను ఆత్మీయాభివృద్ధిలోనికి. దేవునియందలి యధిక దీవెనలకు నడిపించునదిగా నున్నది సాధుగారిని, వారి దైవ సేవను. దేవుని పిల్లలందరి యొక్కయు దైవ సేవలందరియొక్కయు ప్రార్థన సహాకారములకు సమర్పించుచున్నాను. పరమతండ్రియగు దేవుడు వీరిని యత్యధికముగా దీవించి తన సేవకై మరి జయకరముగా వాడుకొనునుగాక !

ఫ్రాంక్ విట్‌కర్.
మెదకు అధ్యక్షమండలాధికారి
26–6–1959.

యెషయ 49 : 6

# విషయసూచిక

| నం | కీర్తన | పుట నం. |
|---|---|---|
| 7. | అయ్యో యేసయ్యా రాబోవుచున్నాడు | 5 |
| 17. | అయ్యా అయ్యా యేసయ్య రాకడకు | 10 |
| 23. | ఆనంద శుభదినము | 15 |
| 48. | ఆశీర్వదించుమా - మా తండ్రి | 36 |
| 68 | అన్ని కాలంబులనున్న యెహోవా | 51 |
| 46. | ఇదిగో ఇదిగో దేవుని వార్తా | 34 |
| 74. | ఇదిగో గొర్రెల కాపరి సోదరులారా | 56 |
| 3. | ఎంత మంచివాడురా యేసు | 3 |
| 28. | ఎంత దయతో బిలిచితివి | 18 |
| 69. | ఎంత ప్రేమ ఎంత ప్రేమయా | 52 |
| 25. | ఓ నాథ నీ దర్శన భాగ్యము | 16 |
| 31. | ఓ ఓ ఓ యింత కాలము వింతగనను | 20 |
| 49. | ఓ ఓ మనసా మారుమనస్సు కలిగెనా | 36 |
| 65. | ఓ యేసునాథా - నా యేసునాథా | 43 |
| 9. | కౌనంటావా కాదంటావా | 6 |
| 33. | కరుణగల శిరమునుండి కారే రక్తంబు | 24 |
| 57. | కన్య కుమారుని చెంత | 42 |
| 58. | కరుణగల తండ్రి దేవా | 43 |
| 62. | కళ్ళు తెరచి కనరా | 46 |
| 40. | చిన్నవాడా యిటుల జేస్తే | 29 |
| 32. | చెప్పలేను నా బాధ | 23 |
| 78. | చింత లేదిక యేసు పుట్టెను | 59 |
| 82. | చూడరే సిలువను బ్రే - లాడు యేసయ్యను | 64 |
| 92. | చేతులెత్తి వందనములు- | 72 |

| నం. | కీర్తన | పుట నం. |
| --- | --- | --- |

# సాధు యోసేపుగారి దైవ పిలుపు

శోధింప శక్యముగాని క్రీస్తు ఐశ్వర్యమును అన్యజనులలో ప్రకటించుటకును సమస్తమును సృష్టించిన దేవునియందు పూర్వకాలమునుండి మరుగైయున్న మర్మములనుగూర్చిన ఏర్పాటు ఎట్టిదో అందరికిని తేటపర్చుటకును పరిశుద్ధులందరిలో అత్యల్పుడనైన నాకు కృప ననుగ్రహించెను ఎఫెసీ. 3 : 8.

నేను వరంగల్ జిల్లాలోని వస్త్రాలపాస్టేటునందున్న కొరిపల్లి గ్రామవాసుడను. నా తల్లిదండ్రులు వ్యవసాయ వృత్తినందు ఉన్నవారు. నా బంధువులతోపాటు యేసు క్రీస్తు నామమున బాప్తిస్మము పొందితిని గాని అంత ఎక్కువగా క్రీస్తును ఎరిగినవాని కాను, నేను ఎప్పుడేగాని బడిలో విద్య నేర్చుకొనలేదు. అక్షర జ్ఞానము లేకుండెను. నాకు వయస్సు వచ్చిన పిదప నా తల్లిదండ్రులు నాకు వివాహము చేసిన పిదపనే మిలటరిలో జాల్నలో 6 నెలలు గడిపితిని తరువాత నా గ్రామము చేరి నా భార్యతోను నా తల్లిదండ్రులతోను కలసి సంతోషముగా జీవించుచుంటిని. కొంత కాలమునకు కుమారుడు కలిగెను. అటుపిమ్మట నా దురదృష్టమువలన మేహముతో నా దేహము చెడి నా చేతులకు కాళ్లకు పుండ్లు వచ్చి అంగవికారముతో క్షీణించుచుంటిని.

ఈ సంగతి నా అత్తగారు విని నా భార్యయైన మరియమ్మను నా కుమారునితో సహా వారి ఇంటికి తీసికొనిపోయిరి. తిరిగి ఎప్పటికిని పంపకుండిరి. నా చిన్న కుమారునిమీద నా ప్రాణము కొట్టుకొనినందున అప్పుడప్పుడు రహస్యముగా నా అత్తగారి గ్రామమునకు వెళ్లి దూరమునుండి చూచుచు వచ్చుచుంటిని. నా తల్లిదండ్రులు, నా అన్నదమ్ములు, నా బంధుమిత్రాదులందరును కూడ నన్ను చూచి అసహ్యించుకొనుచు నన్ను దూరపరచుచు నన్ను అంటకుండ ఉండిరి. నా గ్రామములో ఉన్న వారికి కూడ నేను నీచుడనైతిని. ఈ రీతిగ ఈ భయంకరమైన రోగముతో మూడు నాలుగు సంవత్సరములు బాధపడితిని. ఇదంతయు గమనించి నేను యిక లోకములో బ్రతికి లాభము లేదు. నేను 25 సంవత్సరములు బ్రతికినాను. నాకు ఇంతే చాలును. నావలన నా భార్యకును, నా ప్రియ బంధువులకును తక్కినవారికిని కష్టముగానున్న తరువాత ఇక ఈ భూమి మీద ఉండకుంటె మేలు. నేను దవాఖానాకు పోయిన లాభము లేదు ఇక నాకు ఒకటే మార్గము కనబడినది. నాకు చావే మార్గమని తలంచి ఒక బావిలో పడినాను. నా తల ముఖము బావిలోని బురదయందు చిక్కుకొని యుండగా ఎవరో నన్ను నాకు తెలియనిరీతిగా బయటికి తీసివేసినట్లు కనుగొన్నాను. అక్కడ మనుష్యులెవరును లేకుండిరిగాని ఒక దివ్యమహాత్మ్యము కలిగిన పురుషుడు నా రోగమునందు నన్ను ప్రేమించి రక్షింప

శక్తి గలిగిన కనబడని దివ్యపురుషుడు నన్ను బయటికి తీసివేసెను. అయినను నేను బహుగా ఏడ్చి నేను చస్తానంటేకూడ నన్ను చావనిచ్చుటలేదు గదా యని దుఃఖించితిని. ఆ తరువాత నా యింటికి వెళ్లి గొప్ప విచారముతో మునిగియుండగా బ్రతుకు మీద ఆశలేనట్టి నేను మధ్య రాత్రి మరొక విధముగా చావ యత్నించితిని. 1954 సం॥రము ఆగష్టు 15 వ తేది శుక్రవారము రోజున నా గదిలోని తలుపులన్నియు లోపలనుండి మూసివేసి ఆ గదిలోని దూలమునకు ఒక గట్టిబలమైన దండెము త్రాడుకట్టి నా మెడకు గట్టిగా బిగించి నా గొంతుకకు ఉరిపడ వ్రేలాడే సమయమందు అకస్మాత్తుగా నాకు తెలియనిరీతిగా ఆ త్రాడును ఎవరో మధ్యకు కోసినట్లుగా తెగినందున నేను క్రిందపడితిని. అందువలన మరీ ఎక్కువగా దుఃఖాక్రాంతుడనై ఏడ్చిఏడ్చి ఏమి చేయవలెనో తోచక అట్లే నేలమీద పరుండి బాగా నిద్రపోతిని, అప్పుడు నేను పండుకొనిన గదియంతయు ప్రకాశమైన వెలుగుతో నిండియుండుటయు, ఆ వెలుగునందు యేసు ప్రభువు తన అయిదు గాయములతో వచ్చి నా ముందర నిలువబడి "యోసేపూ, నా కుమారుడా లెమ్ము నీవు భయపడవద్దు నీవు లేచి సజీవమైబలముగలవాడవై రెండంచులుగల ఎటువంటిఖడ్గము కంటెను వాడిగానున్న సత్యవేద గ్రంథమును (బైబిలు) తీసికొని చేతబట్టుకొని నా సాక్షివై యుండుము. నీ రోగము నేను స్వస్థపరచినాను, నీవు పొందిన మేలును నా నామము

పేరిట నా వాక్యము బోధించి ప్రార్థనచేసి అనేకులకు దాని అందించుము" అని పల్కెను. ఆ తరువాత నేను లేచి చూడగా నా పుండ్లు పోయినవి మేహాముతో నున్న నా శరీరము చిన్నపిల్ల శరీరమువలె శుభ్రమైన సంపూర్ణ స్వస్థతనొందెను. నేను మిక్కిలి సంతోషించి ప్రభువును స్తుతించితిని అప్పటినుండి అనగా ప్రభువు నాకు తన వెలుగును చూపి తన కృపను నాకు దయచేసిన దినము ఆగష్టు 15, 1954 సం॥రం నుండి నేను ఇల్లు విడిచి అదే గ్రామమునందున అడవిలోనికి బైబిలు గ్రంథమును చేతపుచ్చుకొని వెళ్లితిని ఆరంభమందు నాకు ఎన్నో హింసలు శోధనలు వచ్చియుండెను. గ్రామవాసులందరు నేను పిచ్చి వాడనని అనుకొనిరి గాని కొన్ని దినములైన తరువాత నా ప్రభువు తన మహిమను ఇతరులకు నాద్వారా కనబరచినందున నావద్దకు వచ్చినవారందరికి దేవుని వాక్యము బోధించుచు నజ రేయుడైన యేసు క్రీస్తు నామమున ప్రార్థించి ప్రభువు దీవెన నందించుచుంటిని, మార్కు 6 : 12-13 (కాగా బయలుదేరి మారుమనస్సు పొందవలెనని ప్రకటించుచు అనేక దయ్యములను వెళ్ళగొట్టుచు, వివిధరోగములను, బానావతి రోగులను, అంగ హీనతగలవారికిని అందరికిని నూనెరాచి, స్వస్థతపడుచు దీవెనలతో బాగగుచున్నారు). ఇట్టి సేవను ప్రభువు ఆజ్ఞ ప్రకారము ప్రభువు నామము పేరిట చేయుచు ఆయా స్థలములకు వెళ్లు చున్నాను.

యేసు ప్రభుని కృప వింతయైనది ప్రభుని నామ మహిమార్థమై వాడుకొనుచున్న, నన్ను కనికరించెను. నా భార్యయగు మరియమ్మకు ఒక దర్శనము కలిగెను. ఒక పురుషుడు చేత బెత్తము పట్టుకొని మరొకచేత నొక గ్రంథము పట్టుకొని ఆమె యెదుట నిలువబడెను, ఆమె మిగుల భయపడెను. కాని ఆ మహానీయుడు, మరియమ్మా, భయపడకుము. యేసు ప్రభువు నిన్ను కనికరించెను. నీ భర్తకు సహాయురాలవై యుండుము అని పలికి అదృశ్యమయ్యెను. ఆమె హృదయములో నూతన కాంతి నుదయించెను. అప్పుడు ఆమె తన్ను తాను దేవునికి సమర్పించుకొని కుమారునితో కూడ అడవిలో నున్న నావద్దకు వచ్చిచేరి నాకు ప్రభువు సేవయందు తోడ్పడుచుండెను. నా ప్రభువు ఆశ్రయములో జీవించుచున్న నాకు పరామర్శ చేయుచు సహాయకురాలై యున్నది. ప్రభువు సేవకు అంత అనుకూలముగా ఉండదని తలచి నా కుమారుని తన మేనమామలవద్ద నుంచినాము. నేను విద్య నేర్చుకొనలేక పోయినను నా ప్రభువు తన మహిమకొరకు నన్ను వాడుకొను నిమిత్తము అద్భుతమైన రీతిగా బైబిలు చదివి దానిలోని మర్మములను ఇతరులకు చెప్పగలిగినంత శక్తిని నాకిచ్చియున్నాడు. ఇట్టి సేవకు నా భార్య కూడా నూతన జీవము కలిగి ప్రభు సేవకు తోడ్పడుచున్నది.

మార్కు 16:10 వారు బయలుదేరి వాక్యము అంతటను ప్రకటించిరి. ప్రభువు వారికి సహాయకారుడై యుండి జరుగుచు వచ్చిన క్రియలను వాక్యమును స్థిరపరచుచుండెను.

గ్రుడ్డివారికి కన్నులు తెరువబడును. చెవిటివారికి చెవులు విప్పబడును. కుంటివాడు దుప్పివలె గంతులు వేయును. మూగ వాని నాలుక పాడును, అరణ్యములో నీళ్లు ఉబుకును. అడవిలో కాలువలు పారును. ఎండమావులు మడుగులగును.

ప్రభువైన యేసు క్రీస్తు దాసుడను

బొటుమంచి యోసేపు

# పాపరోగమునకు మందు

యెషయా 53:6 మనమందరము గొఱ్ఱెలవలె తప్పిపోయితిమి మనలో ప్రతివాడును తనకిష్టమయిన త్రోవను తొలిగెను.

రోమా. 3:23 ఏ భేదమును లేదు. అందరు పాపముచేసి దేవుడు అనుగ్రహించు మహిమను పొందలేక పోవుచున్నారు.

కీర్తన 51:5 నేను పాపములో పుట్టినవాడను, పాపములోనే నా తల్లి నన్ను గర్భము ధరించెను.

1 యోహాను 1:8 మనము పాపము లేనివారమని చెప్పుకొనిన యెడల మనలను మనమే మోసపుచ్చుకొందుము. మరియు మనలో సత్యముండదు.

యాకోబు 1: 14 ప్రతివాడు తన స్వకీయమైన దురాశచేత ఈడ్వబడి మరల కొల్పబడినవాడై శోధింపబడును. దురాశ గర్భము ధరించినదై పాపమును కనగా పాపము పరిపక్వమై, మరణము కనును.

ఇర్మియా 17:9 హృదయము అన్నిటికంటె మోసకరమైనది. అది ఘోరమైన వ్యాధి కలది. దాని గ్రహింపగల వాడెవడు.

రోమా. 6:23 ఏలయనగా పాపమువలనవచ్చు జీతము మరణము.

లూకా. 2:10 భయపడకుడి. ఇదిగో ప్రజలందరికి కలుగబోవు మహా సంతోషకరమైన సువార్తమానము నేను మీకు

తెలియజేయుచున్నాను. దావీదు పట్టణమందు నేడు రక్షకుడు మీకు పుట్టియున్నాడు. ఈయనే ప్రభువైన క్రీస్తు.

మత్తయి 1:21 తన ప్రజలను వారి పాపములనుండి ఆయనే రక్షించును గనుక ఆయనకు యేసు అను పేరు పెట్టుదువు.

అపొ. కా. 4:12 మరి ఎవరివలనను రక్షణ కలుగదు. ఈ నామముననే మనము రక్షణ పొందవలెను.

యెషయా. ౫౩:౫ మన అతిక్రమ క్రియలనుబట్టి అతడు గాయపర్చబడెను. మన దోషములనుబట్టి నలుగ గొట్టబడెను. మన సమాధానార్థమైన శిక్ష అతనిమీద పడెను. అతడు పొందిన దెబ్బలచేత మనకు స్వస్థత కలుగుచున్నది.

హెబ్రీ. 9:23 రక్తము చిందింపకుండ పాప క్షమాపణ కలుగదు.

హెబ్రీ. 10: 4 ఎడ్లయొక్కయు మేకలయొక్కయు రక్తము పాపము తీసివేయుట అసాధ్యము.

1 పేతురు. 1: 18-19 వెండి బంగారములవంటి క్షయవస్తువులు చేత మీరు విమోచింపబడలేదు గాని అమూల్యమైన రక్తముచేత అనగా నిర్దోషమును నిష్కళంకమునగు గొర్రెపిల్లవంటి క్రీస్తు రక్తముచేత విమోచింపబడిరి.

యోహాను. 1:7 ఆయన కుమారుడైన యేసు రక్తము ప్రతి పాపమునుండి మనలను పవిత్రులనుగా చేయును.

1. యోహాను 2 : 1 ఎవడైనను పాపము చేసినయెడల నీతిమంతుడైన యేసు క్రీస్తు అను ఉత్తరవాది తండ్రియొద్ద మనకున్నాడు ఆయనే మన పాపములకు శాంతికరుడై యున్నాడు.

మత్తయి 11 : 28 ప్రయాసపడి భారము మోసుకొనుచున్న సమస్తమైన వారలారా నా యొద్దకు రండి నేను మీకు విశ్రాంతి కలుగజేతును.

యోహాను. 6:37 నా యొద్దకు వచ్చువానిని నే నెంతమాత్రము బైటికి త్రోసివేయను.

హెబ్రీ 10:17 వారి పాపములను వారి అక్రమములను ఇకను ఎన్నటికిని జ్ఞాపకము చేసికొనను.

1. యోహాను. 1:9 మన పాపములను మనము ఒప్పుకొనినయెడల ఆయన నమ్మదగినవాడును నీతిమంతుడును గనుక ఆయన మన పాపములను క్షమించి సమస్త దుర్నీతినుండి మనలను పవిత్రులనుగా చేయును.

యోహాను 1 : 12 తన్ను ఎందరంగీకరించిరో వారికందరికి అనగా తన నామమునందు విశ్వాసముంచిన వారికి దేవుని పిల్లలగుటకు ఆయన అధికారము అనుగ్రహించెను.

మార్కు. 16 : 16 నమ్మి బాప్తిస్మము పొందువాడు రక్షింపబడును. నమ్మని వారికి శిక్ష విధింపబడును.

**కీర్తన 23 అధ్యాయము**

యెహోవా నా కాపరి నాకు లేమికలుగదు.

పచ్చికగల చోట్లను ఆయన నన్ను పరుండజేయు చున్నాడు.

శాంతికరమైన జలములయొద్దకు నన్ను నడిపించు చున్నాడు.

నా ప్రాణమునకు ఆయన సేద దీర్చుచున్నాడు.

తన నామమునుబట్టి నీతి మార్గములో నన్ను నడపించుచున్నాడు.

గాఢాంధకారపు లోయలో నేను సంచరించినను ఏ అపాయమునకు భయపడను.

నీవు నాకు తోడై యుందువు నీ దుడ్డుకర్రయు నీ దండమును నన్ను ఆదరించును.

నా శత్రువుల ఎదుట నీవు నాకు భోజనము సిద్ధ పర్చుదువు.

నూనెతో నా తల అంటియున్నావు నా గిన్నె నిండి పొర్లుచున్నది.

నేను బ్రతుకు దినములన్నియు కృపాక్షేమములే నా వెంట వచ్చును.

చిరకాలము యెహోవ మందిరములో నేను నివాసము చేసెదను.

1. తిమోతి 1 : 15 పాపులను రక్షించుటకు క్రీస్తు యేసు లోకమునకు వచ్చెనను వాక్యము నమ్మదగినదియు పూర్ణంగీకారమునకు యోగ్యమైనదియునై యున్నది.

యోహాను. 3 : 16-21 దేవుడు లోకమునెంతో ప్రేమించెను కాగా ఆయన తన అద్వితీయ కుమారుడుగా పుట్టిన వానియందు విశ్వాసముంచు ప్రతి వాడు నశింపక నిత్యజీవము పొందునట్లు ఆయనను అనుగ్రహించెను. లోకము తన కుమారునిద్వారా రక్షణ పొందుటకే గాని లోకమునకు తీర్పు తీర్చుటకు దేవుడాయనను లోకములోనికి పంపలేదు. ఆయనయందు విశ్వాస ముంచువానికి తీర్పు తీర్చబడదు, విశ్వసింపనివాడు దేవుని అద్వితీయ కుమారుని నామమందు విశ్వాస ముంచలేదు గనుక వానికి ఇంతకుమునుపే తీర్పుతీర్చ బడెను. ఆ తీర్పు ఇదే, వెలుగు లోకములోనికి వచ్చెనుగాని తమక్రియలు చెడ్డవైనందున మనుష్యులు వెలుగును ప్రేమింపక చీకటినే ప్రేమించిరి. దుష్కా ర్యము చేయు ప్రతివాడు వెలుగును ద్వేషించును. తన క్రియలు దుష్ క్రియలుగా కనబడకుండునట్లు వెలుగునొద్దకు రాడు. సత్యవర్తనుడైతే తన క్రియలు దేవుని మూలముగా చేయబడియున్నవని ప్రత్యక్ష. పరచబడునట్లు వెలుగు నొద్దకు వచ్చునని.

మత్తయి. 9:12-13 రోగులకేగాని ఆరోగ్యములవారికి వైద్యు డక్కరలేదు గదా అయితే నేను పాపులను పిలువ వచ్చితినిగాని నీతిమంతులను పిలువరాలేదు గనుక—

కనికరముననే కోరుచున్నాను. గాన బలిని కోరను అను వాక్యభావమేమిటో మీరు నేర్చుకొనబోవుడని చెప్పెను.

మత్తయి 4 : 10 సాతానా పొమ్ము నీ దేవుడైన ప్రభువునకు నమస్కరించి ఆయనను మాత్రము సేవింపవలెను.

## మతాంశములు

**పది యాజ్ఞలు :**

1. నీ దేవుడైన ప్రభువును నేనే తప్ప వేరొక దేవుడు నీకుండకూడదు.
2. దేనిరూపమైనను విగ్రహమునైననునీవుచేసికొనకూడదు. వాటికి సాగిలపడకూడదు. వాటిని పూజింపకూడదు.
3. నీ దేవుడైన ప్రభువు నామమును వ్యర్థముగా ఉచ్చరింప కూడదు.
4. విశ్రాంతి దినమును పరిశుద్ధముగా ఆచరించుటకు జ్ఞాపక ముంచుకొనుము.
5. నీ తండ్రిని నీ తల్లిని సన్మానించుము.
6. నరహత్య చేయకూడదు.
7. వ్యభిచరించకూడదు.
8. దొంగిలింపకూడదు.
9. అబద్ధ సాక్ష్యము పలుకకూడదు.
10. నీ పొరుగువాని దేనినైనను ఆశింపకూడదు.

**రెండు ప్రేమ ఆజ్ఞలు :**

(1) నీ పూర్ణ హృదయముతోను నీ పూర్ణాత్మతోను, నీ పూర్ణశక్తితోను నీ దేవుడైన ప్రభువును ప్రేమింపవలెను.

(2) నిన్నువలె నీ పొరుగువానిని ప్రేమింపవలెను.

**ధన్యతలు :** (మత్తయి 5 : 3-12)

1. ఆత్మవిషయమై దీనులైనవారు ధన్యులు పరలోక రాజ్యము వారిది.
2. దుఃఖపడువారు ధన్యులు వారు ఓదార్చబడుదురు.
3. సాత్వికులు ధన్యులు వారు భూలోకమును స్వతంత్రించుకొందురు.
4. నీతికొరకు ఆకలిదప్పులు గలవారు ధన్యులు వారు తృప్తిపర్చబడుదురు.
5. కనికరము కలవారు ధన్యులు వారు కనికరము పొందుదురు.
6. హృదయశుద్ధిగలవారు ధన్యులు వారు దేవుని చూతురు.
7. సమాధానపర్చువారు ధన్యులు వారు దేవుని కుమారులనబడుదురు.
8. నీతి నిమిత్తము తరుమబడువారు ధన్యులు పరలోక రాజ్యము వారిది.
9. నా నిమిత్తము జనులు మిమ్మును నిందించి హింసించి మీమీద అబద్ధముగా చెడ్డమాటలెల్ల పల్కునప్పుడు మీరు ధన్యులు, సంతోషించి ఆనందించుడి, పరలోకమందు మీ ఫలము అధికమగును.

**యేసు ప్రభువు నేర్పిన ప్రార్థన:** (మత్తయి 6 : 10-15)

పరలోకమందున్న మా తండ్రీ నీ నామము పరిశుద్ధపర్చ బడును గాక; నీ రాజ్యము వచ్చునుగాక; నీ చిత్తము పరలోక మందు నెరవేరుచున్నట్లు భూమియందు నెరవేరునుగాక. మా అనుదినాహారము నేడు మాకు దయచేయుము. మాయెడల అపరాధములు చేసినవారిని మేము క్షమించియున్న ప్రకారము మా అపరాధములను క్షమించుము. మమ్మును శోధనలలోకి తేక దుష్టునినుండి తప్పించుము. ఎందుకనగా రాజ్యమును శక్తియును, మహిమయును నిరంతరమునీవై యున్నవి. ఆమెన్

**పాపములొప్పుకోలు :**

సర్వశక్తియు మిక్కిలి కనికరముగల తండ్రీ, తప్పిపోయిన గొర్రెలవలె మేము నీ మార్గములు తప్పి తిరిగితిమి. మా మనస్సులయొక్క ఆలోచనలనుఆశలను మిక్కిలి అనుసరించితిమి. నీ పరిశుద్ధమైన ఆజ్ఞలను మీరితిమి. మేము చేయవలసినవి చేయక చేయరానివి చేస్తిమి. మాలో క్షేమము ఏమియు లేదు. అయినను మా ప్రభువైన క్రీస్తు యేసుద్వారా నీవు మనుష్యులకు తెలియ జేసిన వాగ్దానముల ప్రకారము ఓ ప్రభువా పాపపీడితులమైన మమ్మును కరుణించుము. ఓ దేవా తమ తప్పితములను ఒప్పు కొనువారిని కాయుము. పశ్చాత్తాపులను తిరిగి చేర్చుకొనుము. మరియు మిక్కిలి కనికరముగల తండ్రీ, నీ పరిశుద్ధనామమునకు

మహిమకలుగునట్లు మేమిక భక్తి, నీతి, సుబుద్ధులలో జీవించు నట్లు ఆయన నిమిత్తము దయచేయుము. ఆమెన్.

**అపొస్తలుల విశ్వాస సూత్రము :**

పరలోక భూలోకములకు సృష్టికర్తయగు సర్వశక్తిగల తండ్రియైన దేవుని నమ్ముచున్నాను. ఆయన అద్వితీయ కుమారుడును మన ప్రభువైన యేసు క్రీస్తును నమ్ముచున్నాను. ఈయన పరిశుద్ధాత్మవల్ల కన్యయైన మరియ గర్భమున ధరింపబడి ఆమెకు పుట్టెను. పొంతి పిలాతు కాలమునందు బాధపడి సిలువ వేయబడి చనిపోయి పాతిపెట్టబడి అదృశ్యలోకములోనికిదిగెను. మూడవనాడు చనిపోయినవారిలోనుంచి తిరిగి లేచి పరలోకము నకు ఎక్కి సర్వశక్తిగల తండ్రియైన దేవుని కుడిచేతివైపున కూర్చుండియున్నాడు. అక్కడినుండి బ్రతికియుండెడివారిని చనిపోయినవారిని విమర్శించుటకు వచ్చును.

పరిశుద్ధాత్మను నమ్ముచున్నాను. పరిశుద్ధసార్వత్రిక సభను పరిశుద్ధుల ఐక్యమత్యమును, పాపక్షమాపణను, మృతుల పున రుత్థానమును నిత్యజీవమును నమ్ముచున్నాను. ఆమెన్.

## అద్భుతములు

1. ఆయన అద్దరినున్న గదరేనియుల దేశము చేరగా దయ్యములుపట్టిన ఇద్దరు మనుష్యులు సమాధులలోనుండిబయలు దేరి ఆయనకు ఎదురుగావచ్చిరి. వారు మిగుల ఉగ్రులైనందున

ఎవడును ఆ మార్గమున వెళ్ళలేకపోయెను వారు దేవుని కుమారుడా, నీతో మాకేమి? కాలము రాకమునుపే మమ్మును బాధించుటకు యిక్కడికి వచ్చితివా" అని కేకలు వేసిరి. ఆయన వాటిని గద్దింపగానే మనుష్యుని వదలిపోయెను. మత్తయి 8:28.

2. తరువాత ఆయన దోనె ఎక్కి సముద్రముదాటి తన పట్టణములో ప్రవేశింపగా జనులు పక్షవాయువుతో మంచముపట్టి యున్న యొకని ఆయనయొద్దకు తీసికొనివచ్చిరి. యేసు వారి విశ్వాసము చూచి, "కుమారుడా నీ పాపములు క్షమింపబడి యున్నవని" పక్షవాయువు గలవానితో చెప్పెను. మనుష్య కుమారునికి అధికారము కలదని మీరు తెలిసికొనవలెనని చెప్పి ఆయన పక్షవాయువుగలవానిచూచి, "నీవు లేచి నీమంచము ఎత్తు కొని నీ యింటికి పొమ్మని" చెప్పగా వాడు లేచి తన యింటికి వెళ్ళెను. జనులు అది చూచి భయపడి మనుష్యులకిట్టి అధికారము ఇచ్చిన దేవుని మహిమ పరచిరి. మత్తయి 9:1-8.

3. ఆయన ఈ మాటలు వారితో చెప్పుచుండగా ఒక అధి కారి వచ్చి ఆయనకు మ్రొక్కి "నా కుమార్తె యిప్పుడే చని పోయినది అయినను నీవువచ్చి నీచెయ్యి ఆమెమీద ఉంచుము. ఆమె బ్రతుకునని" నెను. యేసు లేచి అతని వెంట వెళ్ళెను. ఆయన శిష్యులుకూడ వెళ్లిరి. ఆ సమయమున, పన్నెండు సంవత్సరముల నుండి రక్తస్రావరోగముగల యొక స్త్రీ--నేను ఆయనపై వస్త్రము మాత్రము ముట్టితే బాగుపడుదుననుకొని ఆయన

వెనుకకువచ్చి ఆయన వస్త్రపుచెంగు ముట్టెను. యేసు తిరిగి ఆమెను చూచి—కుమారీ, ధైర్యముగా ఉండుము నీ విశ్వాసము నిన్ను బాగుపరచెనని చెప్పగా ఆ గడియనుండి ఆ స్త్రీ బాగుపడెను, అంతలో యేసు ఆ అధికారి యింటికి వచ్చి పిల్లనగ్రోవులు వాయించువారిని జనసమూహము గొల్లు చేయుచుండుటను చూచి "స్థలమియ్యుడి ఈ చిన్నది నిద్రించుచున్నదేగాని చనిపోలేదని" వారితో చెప్పగా వారాయనను అపహసించిరి. యేసు జనసమూహమును పంపివేసి ఆయన లోపలికి వెళ్ళి ఆమె చెయ్యి పట్టుకొనగానే ఆ చిన్నది లేచెను. ఈ సమాచారము ఆ దేశమంతట వ్యాపించెను. మత్తయి 9:18-26.

4. యేసు అక్కడినుండి వెళ్లుచుండగా ఇద్దరు గ్రుడ్డివారు ఆయన వెంట వచ్చి దావీదు కుమారుడా మమ్మును కనికరించుమని కేకలువేసిరి. ఆయన ఇంట ప్రవేశించిన తరువాత ఆ గ్రుడ్డివారు ఆయన వద్దకు వచ్చిరి. యేసు నేను యిది చేయగలనని నమ్ముచున్నారా? అని వారి నడుగగా వారు నమ్ముచున్నాము ప్రభువా అని చెప్పగా అప్పుడాయన వారి కన్నులు ముట్టి మీ నమ్మిక చొప్పున మీకు కలుగునుగాక అని చెప్పినంతలో వారి కన్నులు తెరువబడెను. అప్పుడు ఇది ఎవరికిని తెలియకుండ చూచుకొనుడని వారికి ఖండితముగా ఆజ్ఞాపించెను. అయినను వారు వెళ్లి ఆ దేశమంతటా ప్రకటించిరి. మత్తయి. 9 : 27-31.

## అలంకరింపబడిన పెండ్లి కుమార్తె

దేవుడు ఆదియందు ఆదామును తన పోలిక చొప్పున సృష్టించెను. దేవుడు మట్టితో ఆదినరుడగు ఆదామును నిర్మించి అతని నాసికా రంధ్రములలో తన జీవవాయువును ఊదగా నరుడు జీవాత్మ ఆయెను ఆదికాండము 2 : 7. దేవుడతనికి ఆదాము అను పేరు పెట్టెను.

అంతట ఆదాము ఒంటరిగా నుండుట సమంజసము కాదని దేవుడు తలచి అతనికి ఒక స్త్రీని జతగా నిచ్చెను. ఆ స్త్రీని ఎట్లు నిర్మించెను ? మట్టితోనా ? ఇనుముతోనా ? ఇత్తడితోనా? రాగితోనా ? లేక వెండి బంగారములతోనా ? ఏ పదార్థమును వాడెను ? తాను చేసిన మనుష్యునికి గాఢ నిద్రను కలిగించెను. అతని ప్రక్కటెముక నొకదానిని తీసి దానితో స్త్రీని చేసెను. ఆదికాండము 2 : 22-23. ఆమె చాల అందమైనది. భూలోకములో యింత సొగసైన స్త్రీ లేదు. దేవుడు నిర్మించిన ఆది స్త్రీ ఆమెయే. ఆమె పేరు హవ్వ.

దేవుడామె కేయేనగలు ధరింపజేసెనో చెప్పబడలేదు. నీతి క్రియలతోడను, పరిశుద్ధతతోడను, సత్యముతోడను ఆమె నలంకరించి తీసికొనివచ్చి ఆదాము యెదుట వుంచి "ఇదిగో అలంకరింపబడిన పెండ్లి కుమార్తెను నీకు జతగా తెచ్చినానని"

చెప్పెను. ఆదాము ఆమెను చూచి "ఓహో నా ఎముకతో చేయబడినదే. నా ఎముకలలో ఒక ఎముక నా మాంసములో మాంసము. ఇది నరునిలోనుండి తీయబడినది గనుక నారి అనబడు"నని చెప్పెను. ఆమె అతని భార్య ఆయెను.

భార్య భర్తకు పరిచర్య చేయుటకు నియమింపబడినది. అలంకరింపబడిన పెండ్లి కుమార్తె తన భర్తను ఆకర్షించవలెను. సేవ చేయవలెను. ప్రేమించవలెను. పెండ్లికుమార్తె అలంకరింపబడనిచో పెండ్లి కుమారుడు సమ్మతింపడు. మంచి గుణము కలిగియుండుట, దయ, ప్రేమ, విధేయత, భయభక్తులు అనెడి అలంకారములను పెండ్లి కుమార్తె నిరంతరము కలిగియున్నచో పెండ్లి కుమారుడామెను ఆకర్షించును. అట్లు గాక అవిధేయత వ్యభిచారము, గయ్యాళితనము, త్రాగుడు మొదలగు అసహ్యమగు గుణములు చినిగిన పేలికలు కట్టుకొనినట్లును, తల విరియబోసికొనినట్లును వుండును గనుక పెండ్లి కుమారునికి యిష్టముండదు.

## ఆదాము - క్రీస్తు వీరిరువురికిగల పరస్పర పోలికలు.

ఆదామును దేవుడెట్లు నిర్మించినదియు తెలిసికొంటిమి. క్రీస్తు పరిశుద్ధాత్మద్వారా సృష్టించబడెను. ఈయనకు జత

యెట్లు చేయబడెను? మొదటి మనుష్యుడైన ఆదాముకు గాఢ నిద్ర కలిగించి గొప్ప శస్త్ర చికిత్స (ఆపరేషన్) చేసి అతని ప్రక్క వెముక నొక దానిని తీసి స్త్రీని సృష్టించెను. క్రీస్తు సిలువమీద తన రక్తము కార్చి బలియగుటచే ఆయన రక్తముచేత కొనబడిన సంఘమనెడు స్త్రీని దేవుడు ఆయన యెదుట నిలువబెట్టెను. (1 కొరింథీయులు 6:20 చూడుము)

ఆ స్త్రీయే అలంకరింపబడిన పెండ్లి కుమార్తె. సంఘమనెడు ఆ స్త్రీ పరిశుద్ధముగా వుండునట్లు కళంకమైనను, ముడతయైనను లేకుండునట్లు నీతి క్రియలతో, వాక్యముతో ఉదక స్నానము చేయించి పవిత్రపరచెను. (ఎఫెసి 5: 27) ఈ సంఘమనెడు స్త్రీ నిత్యము పరిశుద్ధమైనదిగా ప్రార్థనలతోను, దేవుని లేఖనములతోను నింపబడినదై భయ భక్తులతోను, వినయ విధేయతలతోను, తన భర్తకు సేవ చేయుచు, ఇతరులకు అతిథ్యమిచ్చుచుండ వలెనని పెండ్లి కుమారుడగు క్రీస్తు యెల్లప్పుడును ఆమెను కోరుచు ప్రేమించి దీవించుచు, కాపాడుచున్నాడు. ఇదియే పరస్పర సేవ. ఆది నరుడగు ఆదాము హవ్వలకును, మానవుల పాపములకొరకు బలియై తన స్వరక్తమును క్రయ ధనముగా యిచ్చి సంఘమనెడు పెండ్లి కుమార్తెను కొనిన క్రీస్తుకునుగల పరస్పర పోలికలివియే.

లోకములోని మానవుడగు పెండ్లి కుమారుడు పెండ్లి కుమార్తెను దుస్తులు, నగలు, సుగంధ ద్రవ్యములు మొదలగు వాటిచే అలంకరించును. ఇవి బాహ్యాలంకారములు. ఆత్మీయ ఫలములు గలతీ 5 : 22-24 ప్రకారము అంతర్య గుణములు సొగసుగావుంటె సంఘమనెడు పెండ్లి కుమార్తె మిక్కిలి అందముగా కనబడును.

కొంత కాలము క్రితము ఒక స్కూళ్ల డిప్యూటి ఇన్‌స్పెక్టరుగారు ఒక తాలూకా కేంద్రములో యుండిరి. వారు బ్రాహ్మణులు. మంచి దేహ కాంతిగలవారు. ఆయన తన చేతి రుమాలుతో ఎడమ చెంప కనబడకుండ కప్పుకొనెడి వాడు, కారణమేమన అతని ఎడమ చెంపపై పెద్దదగు నల్లని మచ్చ కలదు. అతని స్వచ్ఛమగు ముఖమున ఆ మచ్చ యుండుటతనికిష్టము లేదు. అది అందరికిని కనబడకుండి కప్పు కొంటాడు. పాపము! యెంత కప్పినను యెక్కడ పోవును? అద్దములో చూచుకొని చాల నొప్పి పడెడివాడు. సిగ్గుపడెడి వాడు. కన్నీరు పెట్టెడి వాడు. ఆ మచ్చ అతనికెంత మాత్రమును ఇష్టము లేదు.

సంఘమనెడి పెండ్లి కుమార్తె పెండ్లి కుమారుడగు క్రీస్తును ప్రేమించి ఆయనను సేవించెడి వారుగా నుండ కోరెదరా (ఎఫెసి 5 : 23).

ప్రతి దినమును పరిశుద్ధ గ్రంథమనెడి (బైబిలు) అద్ద మును చూచి మీకు యిష్టములేని పాపమను మచ్చ వున్నచో దానిని సరి దిద్దుకొనుడి. వాక్యమనెడు దీపమును కీర్తనలు 119: 105 వాక్యమనెడి ఖడ్గమును హెబ్రి 4:12 మీరెల్లప్పుడును మీ చేతులయందు కలిగియున్నవారై కీర్తనలు 119:9 ప్రకా రము మీ నడవడిని దిద్దుకొని సత్క్రైస్తవ బిడ్డవై క్రీస్తు నామ మునకు మహిమను కలిగించు బిడ్డలుగా వుండవలెనని మిమ్మును హెచ్చరించుచున్నాను.

నీవు నేను పెండ్లి కుమారుడగు యేసు ప్రభువుకు సంఘమును పరిశుద్ధ కన్యకను సిద్ధపరచుచున్నామా? లేక వికార ముఖముగల కన్యకగా ఆయన యెదుట వుంచుచున్నామా? బాగుగా లేకపోయినచో పెండ్లి కుమారుడు సమ్మతింపడు. మనము (సంఘము) ఒకరికొకరము అవయవములమైయు న్నాము. ఎఫెసి 4:25-32 వఱకు చదువుకొందము. అసహ్య మగు కార్యములు చేయు సంఘమైనచో పెండ్లి కుమారుడగు క్రీస్తు మనలను విసర్జించునేమో? ఇవి కడవరి దినములు. దిన ములు చెడ్డవి గనుక మీరు సమయమును పోనియ్యక ఉప యోగము చేసుకొనుడి. కడు జాగ్రత్త కలిగి యుండుడి ఎఫెసి 5:15-16 చదువుకొందము.

# క్రీస్తే రక్షకుడు

యేసు క్రీస్తునుగూర్చి మీకేమి తోచుచున్నది. అను యీ ప్రశ్న బహు పురాతనమైనదేగాక బహు ప్రాముఖ్యమైనదై యున్నది. ఆయన జీవితమునుగూర్చి సత్యవేద బైబిలు గ్రంథములో విపులముగా వ్రాయబడెను. క్రైస్తవ విశ్వాసము కేవలము యేసు క్రీస్తు మీదనే ఆధారపడియున్నది. ఆయన చేసిన బోధలు—సూచన క్రియలు ఆయనెట్లు జీవించెనో ఏ రీతిగా సంచరించెనో ఆ పరిశుద్ధ జీవితము మీదనే యీ విశ్వాసము ఆధారపడియున్నది. ఆయన ఇట్లు సెలవిచ్చెను. నేనే మార్గమును, సత్యమును, జీవమునై యున్నాను. నాద్వారానే తప్ప ఎవడును తండ్రి యొద్దకు రాడు యోహాను 14:4-6. నేనే పునరుత్థానమును జీవమునై యున్నాను (యోహాను 11:25). నేనే జీవాహారమును యోహాను 6 : 35. ప్రయాసపడి భారము మోసుకొనుచున్న సమస్తమైన వారలారా నా యొద్దకు రండి నేను మీకు విశ్రాంతి కలుగజేతును (మత్తయి 11 : 28). యేసు క్రీస్తు జీవించిన జీవితమునుబట్టియే ఆయన యందు విశ్వాసముంచవలయును కావున ఆయన ఎట్టివాడో కొంతవరకు విచారించుట ఆయన పాపరహితుడు. ఆయన యందు జన్మపాపముగాని కర్మపాపమునుగాని లేదు. ఆయన పుట్టకపూర్వము దేవదూత ఆయననుగూర్చి ఇట్లు చెప్పెను.

పుట్టబోవు శిశువు పరిశుద్ధుడైన దేవుని కుమారుడనబడును లూకా 1 : 35. ఆయన జీవించియున్నప్పుడు తన శత్రువులకు ఆయన యొక సవాలు చేసెను. అది ఏమనగా నాయందు పాపమున్న దని మీలో ఎవ్వడు స్థాపించునో యోహాను 8:4-6. అని వారిని ప్రశ్నించెను. ఆ సవాలుకు వారు జవాబు ఇవ్వకపోయిరి. కావున ఆయన పరిశుద్ధుడు. పాపరహితుడు. మన పాపముల నిమిత్తమై ఆయన చనిపోయెను. ఆయన సర్వ మానవ పాపప రహితము బలిగా తన్నుతాను సమర్పించుకొని సిలువ మరణము నొందెను. ఆదికాలమునుండి మానవులు చేసిన పాపములు పోవ లయునని పుణ్యము దొరకవలెనని పరిహారార్థమైన దహనబలులు హోమములు నైవేద్యములు ప్రాయచిత్త బలులు అపరాధ రిహారాధ బలులు మొదలైనవి చేయుచుండిరి. కాని యేసు క్రీస్తు తానే యీ గొప్ప బలియాగముగా తన ప్రాణమును సమర్పించుకొనెను మనుష్య కుమారుడు పరిచారము చేయించు కొనుటకు రాలేదు గాని పరిచారము చేయుటకును అనేకులకు ప్రతిగా విమోచన క్రయధనముగా తన ప్రాణమిచ్చుటకు వచ్చెను మార్కు 10 : 4-5. అనగా ఈయన అందరికొరకు విమోచన క్రయధనముగా తన్నుతానె సమర్పించుకొనెను తిమోతి 2 : 6 వ ఆయనే. లోక పాపములు మోసికొనిపోవు దేవుని గొర్రెపిల్ల యోహాను 1:29. ఆయన మృత్యుంజయుడు. ఆయన చనిపోయి మూడవనాడు మరణమును జయించి లేచెను.

సమాధిని, మరణమును, పాపమును, లోకమును, జయించెను. ఇట్లు మృత్యుంజయుడైన యేసు క్రీస్తు తన శిష్యులకెన్నియో సార్లు దర్శనము యిచ్చెను. ఆయన యుగ సమాప్తి పర్యంతము సదాకాలము తన భక్తులతో నుండెదనని వాగ్దానము యిచ్చియున్నాడు. సువార్తలన్నియు క్రీస్తును ప్రత్యక్షపరచుచున్నవి. సువార్తల కేంద్రము యేసు క్రీస్తే. ఆయన సర్వ మానవులను తన్ను వెంబడించవలసినదిగా కోరుచున్నాడు. ఆయనను వెంబడించుటద్వారా, ఆయన శిష్యులై ఆయన మనస్సు ఆత్మలను గుణగణములను పొందవలెనని ఆయన కోరుచున్నాడు.

ప్రభువు నామమున ప్రార్థన చేయువాడు రక్షింపబడును రోమా 10 : 13. యేసు ప్రభు అని నీ నోటితో ఒప్పుకొని దేవుడు మృతులలోనుండి ఆయనను లేపెనని నీ హృదయమందు విశ్వసించినయెడల నీవు రక్షింపబడుదువు రోమ 10 : 9. ప్రియ చదువరి యేసు క్రీస్తునుగూర్చి నీకు ఏమి తోచుచున్నది. యేసు ప్రభువు యింకా ఏమి చెప్పుచున్నాడు పాపరోగము శరీరరోగము అనగా గుడ్డితనము కుంటితనము సైతానును వెళ్ళగొట్టి కుష్ఠ రోగము నీకు వున్న చిక్కులన్నిటిని తీసివేస్తాడు. యిక యేమి కొదువ యుండదు. ఆయనను నమ్మినవారికి సమృద్ధిగా నుండును. నమ్మనందుననే యీ కష్టములు. ఇది చదువగానే నీవు ప్రభువైన యేసు క్రీస్తును హత్తుకొనుటకు సిద్ధముగా యుండుము.

# నీవు చేయవలసినదేమి ?

దేవుడు రక్షణ సిద్ధపరచియున్నాడు గనుక నీవు చేయవలసినది యేమియు లేదని ఒక వేళ తలంచవచ్చును. అట్లనరాదు అది కేవలము తప్పు. దేవుడు అనుగ్రహించు దానమును నీవు అంగీకరించవలెనని ఎరుగవా ? ఏర్పరచుకొనుము. తీసికొనుము అంగీకరించుము అని బైబిలు చెప్పుచున్నది రక్షణ సిద్ధముగా చేయబడినది గాని నీవు దాని నంగీకరించవలెను. నేను గిన్నెడు చన్నీళ్ళు ఇచ్చితే నీవు దానిని తీసుకొనవలెనుగదా. డాక్టరుగారు మందు వ్రాసి యిచ్చును. అది ఆయన భాగము అయితే నీవు ఆ మందు పుచ్చుకొనకుంటె నీకేమి లాభము. నీవు నిజముగా రక్షింపవలెనని కోరితె యేసు క్రీస్తు నంగీకరించవలెను.

ఓ నా మిత్రుడా యేసు క్రీస్తును చేర్చుకొనుము తన్నుఎందరంగీకరించిరో వారందరికి అనగా తన నామమునందు విశ్వాసముంచిన వారికి దేవునిపిల్లలగుట ఆయన అధికారమునకు అనుగ్రహించెను. గాని ఆయనను అంగీకరించిన వారు మాత్రమే ఆయన కుమారులును, కుమార్తెలునై యుందురు. రక్షణ ఏదో ఒక మార్గమున కలుగునది కాదు. వాస్తవముగా ఒక తీర్మానము చేసికొనకుండ ఈ లోకములో దేనిని పొందలేము. రక్షణ పొందుటకూడా ఆలాగే ఉన్నది మనము దానిని అంగీకరించ

వలెను. ఒక తీర్మానము కేవలము అవసరమైయున్నది. అట్లయినయెడల ఇప్పుడే క్రీస్తును అంగీకరించుము ఆయనను చేర్చుకొనుము. అయితే ఒకటి జ్ఞాపకముంచుకొనుము. రక్షణను గూర్చిన జ్ఞానము సంపాదించుకొనుట ఒక సంగతి, దానిని హృదయమునందు అనుభవించుట మరియొక సంగతి, ఈ రెంటికిని భేదము కలదు. రైలుబండి నిన్ను గమ్యస్థానమునకు తీసికొని పోగలదని నమ్ముచున్నావు గదా? అయితే ఆ బండిలో కూర్చుంటేనేతప్ప గమ్యస్థానము చేరలేవు. యేసు నిన్ను రక్షించగలడని నమ్మవచ్చును. అయితే ఆ విశ్వాసము ప్రకారము ఆయనను అంగీకరించితేనేగాని నీవు రక్షింపబడలేవు. నీవు క్రీస్తును యేర్పరచుకొనవలెను. ఆయన మీద నీ భారము వేయుము ఆయనకు నిన్ను నీవు అప్పగించుకొనుము. విశ్వాసమే నిన్ను రక్షించును అట్లయినచో ఇప్పుడే ఆయనయందు యెందుకు విశ్వాసముంచవు ?

## ఇప్పుడే అనుకూల సమయము

ఒక వేళ నీవు రక్షింపబడలేదని నీవె ఎరుగుదువు నీవు ఈ రక్షణను అందుకొనక ఆలస్యము చేయుచున్నావు. దేవుని దృష్టిలో రేపు లేదు ఇదిగో యిప్పుడే మిక్కిలి అనుకూల సమయము. ఇదిగో ఇదే రక్షణ దినము (2 కొరి. 6:2). దేవుని సమయము ఇదే నా మిత్రుడా కాలము గడిచిపోయెను ఇదే మంచి

తరుణము ఇప్పుడే తీర్మానము చేసికొనుము. రేపటివరకు ఉండిన యెడల తరుణము దొరుకకపోవునేమో!

నీవు ఏది చేసినను రేపటివరకు జరుపకుము క్రీస్తును అంగీకరించుము ఇప్పుడే ఆయనను ఆహ్వానించుము. ఇప్పుడే నిత్యజీవమును నీవు అనుభవింపగలుగుదువు ఈ విషయమందే నీవు రక్షణ అనుభవించవచ్చును ఒక వేళ సాతాను నిన్ను రేపటివరకు నిలిపి వేయమని ప్రేరేపించిన పక్షమున నిరంతరము ఈ రక్షణను పోగొట్టుకొందువు. జాగ్రత్త. రమ్ము. ఆయనను యిప్పుడే చేర్చుకొనుము. యెహోవా మీకు దొరుకు కాలమందు ఆయనను వెదకుడి ఆయన సమీపములో వుండగ ఆయనను వేడుకొనుడి (యెష. 55:6) ఒక సమయము రాబోవుచున్నది ఆ కాలమందు నీవు ఆయనను కనుగొనవలెను. గనుక ఇప్పుడు ఆయనను అంగీకరించుము.

## పరిశుద్ధాత్మ నడిపింపు

కీర్తన. 25:9 న్యాయవిధులనుబట్టి ఆయన దీనులను నడిపించును.

యాకోబు. 1:5 మీలో నెవనికైనను జ్ఞానము కొదువగానున్న యెడల అతడు దేవుని అడుగవలెను. అప్పుడది అతని కనుగ్రహింపబడును. ఆయన ఎవనిని గద్దింపక అందరికిని ధారాళముగా దయచేయువాడు.

**పరిశుద్ధాత్మ నింపుదలను పొందకుండ చేయు 3 ఆటంకములు**

(1) హృదయమార్పు లేకుండుట (2) అజ్ఞానము (3) అశ్రద్ధ

**పరిశుద్ధాత్మ స్థితికివచ్చు మార్గమేదనగా :** ఎఫెసీ. ౩:1-19
క్రీస్తు మీ హృదయములలో విశ్వాసముద్వారా నివసించునట్లుగా
.........ప్రార్థించుచున్నాను.

ప్రకటన. 3 : 20 ఆయనయందలి విశ్వాసముద్వారా పాప ప్రాయశ్చిత్తముదొరికెను. ఏలాటి విశ్వాసముద్వారా మనము విమోచింపబడితిమో ఆలాటి విశ్వాసము ద్వారానే క్రీస్తు మనలో నివాసముచేయును. ఆయన ఎప్పటికిని మన హృదయములయొద్ద నిలువబడి మన హృదయ తలుపులను తట్టుచున్నాడు.

గలతీ 2 : 20 నేను క్రీస్తుతో కూడ సిలువ వేయబడియున్నాను. ఇక జీవించువాడను నేను కాను. క్రీస్తే నాయందు జీవించుచున్నాడు.

ఫిలిప్పీ. 1 : 21 "నామట్టుకైతే బ్రతుకుట క్రీస్తే."

## క్రీస్తు మరణముయొక్క ఉద్దేశము

యెషయ. 53 : 3 మన యతిక్రమ క్రియలనుబట్టి అతడు గాయ పరచబడెను. మన దోషములనుబట్టి నలుగగొట్టబడెను

మన సమాధానార్థమైన శిక్ష అతనిమీదపడెను. అతడు పొందిన దెబ్బలచేత మనకు స్వస్థత కలుగుచున్నది.

1 పేతురు. 3 : 18 ఏలయనగా మనలను దేవునియొద్దకు తెచ్చుటకు. అనీతిమంతులకొరకు నీతిమంతుడైన క్రీస్తు శరీర విషయములో చంపబడి, పాపముల విషయములో ఒక్కమారే శ్రమపడెను.

1 కొరి. 15 : 3 లేఖనముల ప్రకారము క్రీస్తు మన పాపముల నిమిత్తము మృతిపొందెను.

1 పేతురు 2 : 24 మనము పాపములవిషయమై చనిపోయి నీతి విషయమైజీవించునట్లు ఆయన తానే తన శరీరమందు మన పాపములను మ్రానుమీద మోసికొనెను.

మత్తయి. 20 : 28 ఆలాగే మనుష్యకుమారుడు పరిచారము చేయించుకొనుటకు రాలేదు గాని పరిచారము చేయుటకును అనేకులకు ప్రతిగా విమోచన క్రయధనముగా తన ప్రాణము నిచ్చుటకు వచ్చెను.

1 కొరింథీ. 5: 7 క్రీస్తు అను మన పస్కా పశువు వధింపబడెను,

యోహాను. 12, 24 గోధుమగింజ భూమిలోపడి చావకుండిన యెడల అది ఒంటిగానే యుండును. అది చచ్చిన యెడల విస్తారముగా ఫలించును.

# క్రీస్తు తిరిగి వచ్చుననుట సత్యము

యోహాను. 14 : 3 నేను వెళ్ళి మీకు స్థలము సిద్ధపరచినప్పుడు నేనుండు స్థలములో మీరు ఉండులాగున మరలవచ్చి నాయొద్దనుండుటకు మిమ్మును తీసికొనిపోవుదును.

హెబ్రీ. 9 : 28 అలాగుననే క్రీస్తు కూడ అనేకుల పాపములను భరించుటకు ఒక్కసారే అర్పింపబడి, తనకొరకు కని పెట్టుకొని యుండువారి రక్షణ నిమిత్తము పాప సంబంధములేకుండ రెండవసారి ప్రత్యక్షమగును.

ఫిలిప్పీ. 3:20-21 మన పౌరస్థితి పరలోకమందున్నది. అక్కడ నుండి ప్రభువైన యేసు క్రీస్తు అను రక్షకునికొరకు కనిపెట్టుకొని యున్నాము. సమస్తమును తనకు లోబర్చుకొనజాలిన శక్తినిబట్టి ఆయన మన దీన శరీరమును తన మహిమగల శరీరమునకు సమ రూపము గలదానిగా మార్చును.

1 థెస్స. 4 : 18 కాబట్టి మీరు ఈ మాటలచేత ఒకరికొకరు ఆదరించుకొనుడి.

1 యోహాను. 2 : 28 కాబట్టి చిన్న పిల్లలారా ఆయన ప్రత్యక్ష మగునపుడు ఆయన ఆగమనమందు మనము ఆయన ఎదుట సిగ్గుపడక ధైర్యము కలిగియుండునట్లు మీరా యనయందు నిలిచియుండుడి.

---

# కీర్తనలు

## 1

పల్లవి: యేసు ప్రభువు నీకు శరణు-యిప్పుడే జేతు బ్రోవుమయా-
యిపుడే జేతు బ్రోవుమయ్యా = యెపుడు జేతు బ్రోవు
మయ్యా - లోకమెల్ల నీవేగదా - లోకమెల్ల నీవెగదా
॥యేసు ప్రభువ

1. దూరదర్శమున దీనులైన మాకొరకు=కన్య మరియమ్మ కిల ధన్యుడ జన్మించితివి-ధన్యుడ జన్మించితివి ॥యేసు ప్రభువ
2. యెంతెంతో అద్భుతములు వింతగాను జేసినావు వింతగాను జేసినావు=వింతగాను జేసినావు వివరముగా దెలిపినావు - వివరముగా దెలిపినావు ॥యేసు ప్రభువ
3. కానాను ఊరిలోన-కడువింతగా నీరు (2) = ద్రాక్షరసము జేసినావు ధన్యుడవు యేసయ్యా-ధన్యుడవు యేసయ్యా ॥యే
4. నాయీనను ఊరిలోన విధవకుమారుని (2) = దయ ఉంచి లేపినావు ధన్యుడవు యేసయ్యా ధన్యుడవు యేసయ్యా॥యేసు
5. ఈలాటి అద్భుతములు వేలకొలది జేసినావు (2)=వేలకొలది జేసినావు_వెల లేనిస్తోత్రములు-వేలకొలదిస్తోత్రములు॥యేసు
6. రాజా మారాజా-నజరేతు రాజా మా క్రీస్తురాజా-రాజమా క్రీస్తురాజా=ఆదరించు మీ వేళ - ఆనంద మొందగాను (2) ॥యేసు ప్రభువ

## 2

పల్లవి: మా తండ్రి దేవుడా-లోక లోకంబులకు యేక తండ్రివిగా
॥మా తండ్రి

1. మాతండ్రి దేవుడా - కారండఅడవిలో - నీరుండని జాగలో
॥ మా తండ్రి

2. మాతండ్రి దేవుడా-నీరుండని జాగలో-మీ రెట్లున్నారయా
॥మా తండ్రి

3. మాతండ్రిదేవుడా-దయ్యాయొకటివచ్చి-కయ్యామాడెనురా
॥మా తండ్రి

4. మాతండ్రి దేవుడా - చేయుమురాళ్ళను-రొట్టెలగునట్లుగా
॥ మా తండ్రి

5. మాతండ్రి దేవుడా - రొట్టెలవలనకాదు దైవవాక్యంటివా
॥మా తండ్రి

6. మాతండ్రి దేవుడా-గుడిశిఖరంపైనుండి-క్రిందికి దుముకుమా
॥మా తండ్రి

7. మాతండ్రి దేవుడా-దెబ్బతగలకముందు - దూతలెత్తుదురనే
॥మా తండ్రి

8. మాతండ్రి దేవుడా - వాదమెందుకునాతో- వద్దుపొమ్మంటివి
॥మా తండ్రి

9. మాతండ్రి దేవుడా-లోకమహిమలుజూప కొండనెక్కించెనా
॥ మా తండ్రి

10. మాతండ్రి దేవుడా-వంగినమస్కరించి తొంగిచూడనెనురా
॥మా తండ్రి

11. మాతండ్రి దేవుడా-సాతాను నినువీడి - సరగబొమ్మంటివా
॥మా తండ్రి

12. మాతండ్రి దేవుడా-నీ దేవుడైన ప్రభుని పూజించుమంటివా ॥మా తండ్రి

13. మాతండ్రి దేవుడా-ఇమ్మహిలో మీకిట్లు ముమ్మారుజరిగెనా ॥మా తండ్రి

**3**

పల్లవి: ఎంతమంచివాడురా యేసుస్వామి-సంతోషముతో
నన్ను చేరదీసెరా ॥ఎంత

1. భయములేదు గియములేదు నయమైనవాడురా =
పి్రయమైన మాటలాడి ప్రేమజూపెరా ॥ఎంత

2. నన్ను ఎత్తుకొనెరా నన్ను ముద్దుబెట్టెరా =
నన్ను కౌగలించెరా నన్ను దీవించెరా ॥ఎంత

3. సిలువమరణమొందెరా-మనకొరకై -
మరియు మూడవనాడు తిరిగిలేచెరా ॥ఎంత

**4**

పల్లవి: రండి రండి రండయో రక్షకుడు-బుట్టును-రక్షకుని
జూడను రక్షణాలు బొందను॥

1. సాతాను సొత్తులో సంతోషమేదిరా=సంతృప్తిగలదు
శ్రీ యేసు రాకలో ॥రండి

2. బేత్లాలేమూరిలో బీదకన్య మరియకు=పశులశాలలో
బుట్టియున్నాడట ॥రండి

3. యూదులరాజట-రాజుల రాజట=రక్షణాలు ఇవ్వను వచ్చి
యున్నాడట ॥రండి

4. తండ్రి తన శుద్ధాత్మ త్రియేక దేవునకు=ఘనత మహిమ
చెల్లుగాక యిప్పుడు నెల్లప్పుడు ॥రండి
5. ఆ లోక సుఖములో ఈ లోకమెంతరా=ఆనందడోలికలు
అలలాడుచోటురా ॥రండి
7. మానవునికొరకైన మానవావతారుడై =పరమ విడిచి వచ్చెను
పరిశుద్ధహృదయుడై ॥రండి

**5**

పల్లవి: రక్షకా నా వందనాలు శ్రీ రక్షకా నా వందనాలు శ్రీ

1. నా నిమిత్తమై నీవు నరుడవై పుట్టినావు ॥రక్షకా
2. మొట్టమొదట సాతాను మూలబడగొట్టినావు ॥రక్షకా
3. పాపభారమెల్ల మోసి-బరువు దించివేసినావు ॥రక్షకా
4. వ్యాధిభారమెల్ల మోసి-వ్యాధి దించివేసినావు ॥రక్షకా
5. శిక్షభారమెల్ల మోసి - శిక్ష దించివేసినావు ॥రక్షకా
6. మరణమొంది మరణభీతి-మరలకుండ జేసినావు ॥రక్షకా
7. జబ్బుచేత బాధనొందు-జనుల జూడ జాలినీకు ॥రక్షకా
8. మందువాడకుండ జబ్బు-మాన్పి వేయగలవు తండ్రి ॥రక్షకా
9. నమ్మికగలవారను-నయముచేసి పంపగలవు ॥రక్షకా
10. నేను చేయలేనివన్ని-నీవే చేసి పెట్టినావు ॥రక్షకా
11. యేసు క్రీస్తు ప్రభువు నిన్ను -యేమనిస్తుతింపగలను ॥రక్షకా
12. మరల నీవు రాకముందు-గుర్తులుండనన్నావు ॥రక్షకా
13. అందరికి తీర్పురాక-ముందే బోధచేసినావు ॥రక్షకా
14. దీవించి శిష్యులను-దేవలోక మేగినావు ॥రక్షకా
15. సృష్టిని బోధించుమని-శిష్యులకు దెల్పినావు ॥రక్షకా
16. నరకము దప్పించి మోక్ష-పురము సిద్ధపరచినావు ॥రక్షకా
17. నీకు నీ సంఘమునకు-నిత్యము జయము జయము ॥రక్షకా

## 6

పల్లవి: యేసే జన్మించెరా తమ్ముడా - దేవుడవతరించెరా॥
ఓరి తమ్ముడా - ఓరి తమ్ముడా - ఓరోరి తమ్ముడా॥

1. పెద్ద పెద్ద రాజులంత-నిద్దురాలు బోవంగ = అర్థరాత్రి వేళ మనకు ముద్దుగా జన్మించెనయా ॥యేసే

2. బెత్లెహేము గ్రామమందు-బీదకన్య గర్భమందు = నాథుడు జన్మించెనయా - మేలుగ మనకందరికి ॥యేసే

## 7

పల్లవి: అయ్యో యేసయ్యా రాబోవుచున్నాడు - రాజుగారీ
లోకమునకయ్యా-రక్షకుండీలోకమునకయ్యా ॥అయ్యో

1. రారాజు వస్తాడు - రాజ్యంబు దెస్తాడు= రాగాలు తీయండి మీరంత రమ్యముగ బాడండి మీరంత ॥అయ్యో

2. ప్రభు యేసు వస్తాడు - ఫలములు దెస్తాడు=ప్రార్థనలు జేయండి మీరంత ॥అయ్యో

3. శ్రీ యేసు వస్తాడు - సింహాంబురీతిగా=సిద్ధపడియుండుడి మీరంత-చిక్కులన్ని విడువండి మీరంత ॥అయ్యో

4. భర్తవలె వస్తాడు-భాగ్యంబు దెస్తాడు = భార్యవలెనుండండి మీరంత-భాగ్యమును పొందండి మీరంత ॥అయ్యో

5. నమ్మినవారికి నా రాజ్యమిత్తునని=యేసు జెప్పెను నమ్మరయ్యా-నరకంబు లేదనెను నమ్మరయ్యా ॥అయ్యో

6. యూదులు బోధకులు-వి త్తనాలు జల్లంగ=పట్టెరో యేసయ్యా పాదములు ॥అయ్యో

**8**

పల్లవి: ప్రభువు యేసు పుట్టినది - పావనదినమే పావనదినమే
పరమ భాగ్యంబులు నరులకు దొరుకునట్టి-యీదినమే

1. మరియమ్మ గర్భము మనకొరకై - మనకొరకై - మనుజావ
తరించినది మరి గొప్ప భాగ్యమని-యీదినమే ॥ప్రభు

2. మందలను గాయుచున్న-గొల్లవారికి గొల్లవారికి=మానుగ
దొరికినట్టి-మరిగొప్ప భాగ్యమని-యీదినమే ॥ప్రభు

3. చుక్కను జ్ఞానులు చూచిరి నేడే-చూచిరి నేడే =
సుందర యేసునకు వందనములు జెప్పివచ్చిరట ॥ప్రభు

4. బంగారు సాంబ్రాణి-బోళంబులను-బోళంబులను =
బాల యేసునకిచ్చి బహుసంతోషించినది-యీదినమే ॥ప్రభు

5. యెహోవా పంపించిన-మహాదానమే-మహాదానమే =
మానుగదొరికినట్టిమరి గొప్ప భాగ్యమని-యీదినమే ॥ప్రభు

**9**

పల్లవి: ఔనంటావా - కాదంటావా యేసయ్యే దేవుడంటే
యేమంటావు-నీవు యేమంటావు॥

1. కుంటివారికి కాళ్లనిచ్చె= కష్టంబుదీసియు కరుణించెను ॥గనుక

2. గ్రుడ్డివారికి కండ్లనిచ్చె=గుణపడిన వారంత-ఘనపర్చిరి ॥గనుక

3. గలిలయ్యసముద్రముమీదను=గాలివానలనుగద్దించెను ॥గనుక

4. అయిదు రొట్టెలను రెండు చేపలతో = అయిదు వేల
మంది కాహారమిచ్చెను ॥గనుక

5. చచ్చిన లాజరు-సజీవుడాయె=అక్క చెల్లెండ్లకు
ఆనందమాయె ॥గనుక

## 10

పల్లవి: పేరుకు క్రైస్తవుడైనవాడా-తీరనికోరిక కోరేవాడా -
మారితె రక్షణ కల్గునురో నరుడా క్రైస్తవుడా - నీ
నేరములెన్నో చూడుమురో నరుడా క్రైస్తవుడా॥

1. ఒకరు బ్రతికితే ఓర్వలేకను-సుఖము గలిగితే చూడలేకను=
తికమక లెన్నో పడుచునుందువు-పకపకనవ్వుచుపోవుచుందువు॥
2. మంచితనములు మాయచేతువు-లంచగొండివై
తిరుగుచుందువు= పెంచి పెద్దపాపంబు జేతువు ॥మారితే
3. యేసు దేవుడనిచెప్పుచుందువు-లేచిలేచి బోధించుచుందువు=
మోసకార్యములు జేయుచుందువు - లేశమైన శంకించ
కుందువు ॥మారితే
4. నీదు కంటిలో దూలమెంచక-ఒకరి కంటిలో నలుసునెంతువు
బీదవారికి బాధపరుతువు - వేదవాక్యమును మరచిపోదువు
॥మారితే
5. గుడికి రమ్మని జెప్పుచుందువు-కడకుబో యింటియందె
ఉందువు=చూడమనుచు ప్రార్థనలు జేతువు-మేడిపండు
చందనా యుందువు ॥మారితే
6. గట్టిగ చందవేయుచుందువు-ఘనత రావలని కోరుచుందువు=
తూటురాగిపైసైన వేయవు-మాటలెన్నియో చెప్పుచుందువు
॥మారితే

## 11

పల్లవి: పరికించితరికించి పరిశుద్ధగ్రంథంబు=పరిశుద్ధతనుజూడుమా
క్రైస్తవా-క్రీస్తు యేసును జూడుమా॥

1. పేరుకే మాత్రము క్రైస్తవులమనుచును-పెగ్యాల జేతు
వయ్యా-క్రైస్తవ ప్రేమ మనలో లేదయా ॥పరి

2. ఆదివారమునాడు-ఆరాధనాలేదు-అన్యులతో
సహవాసము క్రైస్తవ ఆత్మ మనలో లేదయ్యా ॥పరి
3. సిలువపై యేసుండు-చిందించె రక్తంబు-సిగ్గయిన
లేదేమయ్యా క్రైస్తవసిలువపైన జూడుమా ॥పరి

**12**

పల్లవి: (శ్రీ) యేసు నామము పరలోక రాజ్యము -
భూలోకమంత యేసు భజనకై ॥

1. మోకాళ్ళమీద పూనండి-మొరపెట్టి దేవుని వేడండి ॥(శ్రీ)
2. తలయమాండ్లు మీరుదీయండి-తలలొంచి ప్రార్థనచేయండి॥(శ్రీ)
3. అలవాటులు మీరు విడువండి-ఒళ్లొంచి ప్రార్థనచేయండి॥(శ్రీ)
4. కాళ్ళ చెప్పులు విడువండి కాళ్లొంచి ప్రార్థనచేయండి ॥(శ్రీ)
5. తలమీద కొంగులు వేయండి-తలవంచి ప్రార్థనచేయండి ॥(శ్రీ)
6. నోట్ల చుట్టలు తీయండి-నోరెత్తి పాటలు పాడండి ॥(శ్రీ)
7. మనసులన్ని విప్పండి-మనసార పాటలు పాడండి ॥(శ్రీ)

**13**

పల్లవి: ప్రీతిగల దేవుడా - స్తోత్రములను చేతుము=రాత్రి
యంత మాకు మంచి నిద్రనిచ్చునందుకు ॥ప్రీతి
1. తల్లి రొమ్మునందుండు పిల్ల రీతి మమ్మును=చల్లగ
గాపాడినావు-తెల్ల వారివరకును ॥ప్రీతి
2. ఉదయముననేలేచి నీ-పాదములకు మ్రొక్కెదు=
సదయుడ మాతోనుండు సాయంకాలమువరకు ॥ప్రీతి
3. మేముచేయు పనులలో - స్వామి మాతో నుండుమా=
క్షేమమైన మార్గమున-స్వామినన్ను నడుపుమా = ప్రీతి॥

## 14

పల్లవి: యేసయ్యా దేవుడు-యెంతో సుబోధ జేసె
ఎల్ల వారికిని యేసయ్యా దేవుడు

1. నా నిమిత్తంబు నా నరుల నిందించిమిమ్ము-
నష్ట పెట్టుదురనే యేసయ్యా దేవుడు ॥యేసయ్యా
2. దేవుని జనులు తిట్టి హింసించి జనులు -
దిగనాడే వారనే యేసయ్యా దేవుడు ॥యేసయ్యా
3. కఠినులు మిమ్మును-కష్టాలపాలు జేసి -
కష్ట పెట్టుదురనే ॥యేసయ్యా
4. సకల కష్టాలలో-సకల నిందలయందు -
సంతోషించుడనే ॥యేసయ్యా
5. పరలోకమందున-ఫలము మీ కధికంబు -
ప్రజలార వినుడనే ॥యేసయ్యా

## 15

పల్లవి: పరమ తండ్రి నీవయ్యా-వరములియ్యాను రావయ్యా॥

1. పాపములోనే బడినాను-పరిశుద్ధతండ్రి రక్షించు ॥పరమ
2. నీ రక్తముచే నా కలుష మీవేకడుగుము ఎల్లప్పుడు ॥పరమ
3. ఇక గతినాకు ఎవ్వరు-ఈ లోకములో నాకయ్యా ॥పరమ
4. నీ సేవను నే జేయుటకై-నీ దాసునిగ జేసికొను ॥పరమ
5. నా ప్రాణము నప్పగింతూ-నా దేవా నీ సేవకై ॥పరమ
6. భజనలు జేసెద నీకయ్యా-నిజముగ దేవా నీ కొరకై ॥పరమ

## 16

పల్లవి: శ్రీ యేసునాధుని - శ్రీ యేసునాధుని =
ఆరాధింతాము - శ్రీ యేసునాధుని

1. అందరియందున - ఆత్మలయందున=
ఆరాధింతామా శ్రీ యేసునాధుని ॥శ్రీ
2. పరమును విడిచెను - పాపులకొరకై =
వరముతో జన్మించె వరకన్య మరియకు ॥శ్రీ
3. పరలోక రక్షణకై సంపూర్ణ ప్రేమ సేవ=
సత్యబలియాయెను సకలభయమును దీర్చెను ॥శ్రీ
4. శక్తిని జూపెను - చావును గెలిచెను=
సత్యాదేవుండై సదా జీవించెను ॥శ్రీ
5. తాళతబ్లాలు తట్టూచు మనము=తనివి
దీర ప్రేమతో తట్టుదాము చేతులు ॥శ్రీ
6. తండ్రి కుమారా శుద్ధాత్మచే దేవుని=తడయక
భజనలు - త్వరగ జేయుదుము ॥శ్రీ

## 17

పల్లవి: అయ్యా అయ్యా యేసయ్యా రాకడకు మీరు
తయ్యారవ్వండి తయ్యారవ్వండి

1. యేసయ్యా రాకడకు - యేమేమివింతాలు-బలె యేమేమి
వింతాలు = మోసంబు కాదిది మోసపోకండి దోసిలొగ్గండి
॥అయ్యా
2. బైబిలు మాటలు-బహుతేటమాట-బహుతేట
మాటలు - భారంబుగాదని భంగమనుకొని బేలబోకండి
తయ్యారుపడండి ॥అయ్యా

3. కడతీర్పు వేళండి - కడు వేదనలండి - పలువిధ ఖేదనములండి
నడువుండి కడగడియకు - తడబడబోకండి
తయ్యారుపడండి - తయ్యారవ్వండి ॥అయ్యా

4. కడుఘోరమైన ఖడ్గము-కనులారా జూచెదను-మీరు
కనులారా జూచెదరు-కడబూరయూదెడి-దూత
కరమున ఖడ్గమున్నది తయ్యారుపడండి ॥అయ్యా

5. గంభీరరూపుడు-ఘనుడైన రాజండి భళెఘనుడైన
రాజండి-గర్వంబు కాదది-గర్వపడకుండి-గడగడ
వణకండి తయ్యారుపడండి ॥అయ్యా

## 18

పల్లవి: జయము మరలవచ్చె జయభేరి మ్రోగించి=జయము
వెయ్యేండ్లలోన క్రీస్తుకు-జగము యుగములయందునా

1. వసుధ యిక రాజైన అంత్య క్రీస్తును గెలిచి=అసమాన
తేజంబుతో ప్రపంచమంత క్రీస్తే చేయును ॥జయము

2. యేసయ్య భూలోకమెల్ల పరిపాలించు=దోషంబులే
యుండవు సైతాను మోసంబులే యుండవు ॥జయము

3. పులులు మేకలుకూడి చెలిమితో తిరుగును=ఖలులింక
జాలరింకా సర్వభూతములు కలకలలాడును ॥జయము

4. పాములతో కూడి ప్రతివారు పసివారు= క్షేమముగా
నడుచుచుందురు-పాము విషమే యుండదు ॥జయము

5. ముండ్లతుప్పలు ఎందు మొలువనే మొలువవు-ఫలవృక్షము
లుండును కష్టపడకుండ పంటలు యుండును ॥జయము

6. కులభేదముండదు-కొదువ ఏమియు రాదు=స్థలభేదమే
యుండదు-మతముల కలత లేమియునుండవు ॥జయము

## 19

పల్లవి: యెంతఘోరమైన సిలువ-నరహంతకులు మోపిరయ్యా=
పంతగించి చింతలేక వంచకులు జంపిరయా॥

1. కాళ్లు చేతులందు మేకుల్ - వారు కరుణలేక గొట్టిరయ్యా=
చిల్లుచుండె రక్తధారా-కలువరిపై సిలువధార ॥యెంత

2. క్రూరులైన యూదులు నిన్ను-బహుఘోరముగను
జంపిరయ్యా=నోరు దెరువకుంటివి నాథా, యేరులై
పారంగా ధారా ॥యెంత

3. ఘోరమైన పాపినయ్యా-నా భారమేమో మోసితివా=
మేరలేని ప్రేమధార జూపితివి నాకై యీ ధరన్ ॥యెంత

4. నమ్మితి నీ పాదమయ్యా - నాకిందు గొప్పభారమయ్యా =
నెమ్మది నాకిచ్చినావా-ఇమ్మహిని సిలువద్వారా ॥యెంత

## 20

పల్లవి: పండుకోసమై ఆశనుబొందిరి-హవ్వ ఆదాము
అయ్యో హవ్వా ఆదాము ॥పండు

1. సృష్టికర్త వాక్యములను మరచి సర్పబోధలను నమ్ముకొని=
యేమైనాడో యేమగునోయని వెదకుచు తండ్రి వనముననే
॥పండు

2. ప్రియముతో బిలిచి తండ్రిని జూడ సిగ్గుతో ఆకులు జుట్టుకొని= చిన్నబోయిన మోముతో వారు దాగిరి చెట్ల చాటుననే ॥పండు

3. భయమొందిన దంపతులను బిలిచి భగవంతుడు వారలకు= ఇచ్చెను శాపము వెంటనే వారికి-భూమిని దున్నుచు బ్రతుకుమని ॥పండు

**21**

పల్లవి: పరలోక నాయకుండ, పరమతండ్రి సుతుడు యేసా= పరమువిడిచి ధరణికరిగినావా నా ముద్దు యేసా పరము విడిచి ధరణికరిగితివా॥

1. పాపినైన నాకొరకు ప్రాణమియ్య పరమువిడిచి పాప భారము భరియించితివా-నాముద్దు యేసా ॥పరలోక

2. దొంగనైన నాకొరకు పుణ్యవంతుడవైన-నీవు దొంగలమధ్య సిలువ మోసితివా ॥పరలోక

3. నాదు దుష్ట తలంపులన్ని నీదు దివ్యశిరముపైన ముండ్లకిరీటము బెట్టిరా నా ప్రియ ॥పరలోక

4. నాదు చేతులు జేసినట్టి ఘోరపాపంబులకై - నీదు చేతులు గాయమొందెనా ॥పరలోక

5. నాదు హృదయము చెడ్డయోచన చేసిన పాపంబునకై - నీదు హృదయము గాయమొందెనా ॥నాముద్దుయేసా

6. పరుగెత్తి పాపములుచేసిన పాపంబునకై -నీ బంగారు పాదములలో మేకులొందెనా ॥నాముద్దుయేసా

7. తల్లికైన తండ్రికైన అన్నదమ్ములకైన లేదే-కన్న పిల్లల
కైన లేదయ్యా ఈలాటి ప్రేమ ఎన్న తరముగాదయ్యా-
యీలాటి ప్రేమ ॥పరలోక

**22**

పల్లవి: జగన్నుత కీర్తనానందచరిత-ఆనందచరిత నాయనా -
ఆనందచరిత పరమానందచరిత నాయనా

1. మరియమ్మ గర్భవిధానంబునందునా నరజన్మ మెత్తినావా
నాయనా=నరజన్మమెత్తినావా యీధరణికేతెంచినావా
నాయనా ॥జగన్నుత

2. పేదవారింటిలో బీదకన్యకు నేడు మోదముతో బుట్టినావా
నాయనా = మోదముతో బుట్టినావా యీధరణికేతెంచి
నావా నాయనా ॥జగన్నుత

3. గొల్లవారు రాత్రి నీ దర్శనంబున ఉల్లాసమొందినారా -
ఉల్లాసమొందినారా వారు తెల్లవారెల్లినారా నాయనా
॥జగన్నుత

4. జ్ఞానోత్తములు తూర్పు చుక్కండవచ్చి కండ్లారాజూచినారా
నాయనా=కండ్లారజూచినారా వారు కానుకలిచ్చినారా
॥జగన్నుత

5. వరదూతమూకల్ సమాధానమంచు పరమందు బాడినారా
నాయనా=పరమందు బాడినారా వారు ధరణికేతెంచినారా
నాయనా ॥జగన్నుత

## 23

పల్లవి: ఆనంద శుభదినము అందరికిదే దినము=పొందుగ
రక్షకుండు పుట్టినదిదే దినము

1. నరుల రక్షణగోరి పరలోక మహిమ విడని=
కరుణగల దేవుడిలలో నరరూపుండైన దినము ॥ఆనంద

2. పరమదూతలుగూడి పాడినదిదే దినము =
పాపాత్ములందరికి పావనమైన దినము ॥ఆనంద

3. గొల్లబోయలు ముందువెళ్ళి మ్రొక్కిన దినము =
కొల్లగ మనమందరము వెళ్లి పూజించు దినము ॥ఆనంద

4. జ్ఞానులు తారకంబు గాంచినదిదే దినము =
కానుకలిచ్చుటకు కదిలినదిదే దినము ॥ఆనంద

5. బాలబాలికలారా ప్రభుసంఘపు పెద్దలారా =
మేలైన శుభదినము. మేల్కొందము జన్మదినము ॥ఆనంద

## 24

ప: శ్రీయేసయ్యా సిలువ వెలుగు=చెంతవచ్చే చేరితిమయ్యా॥

1. పాపమంత బాపియేసు=పావనయేసు ప్రభువా నీవే ॥శ్రీ
2. దేవ దేవా యేసుదేవా=దీవెనలిమ్ము శ్రీయేసు దేవ ॥శ్రీ
3. సిలువను దెచ్చి భుజమున బెట్టి=పదుపదుమనిరి కలువరిగిరికి ॥శ్రీ
4. నీవే సత్యం నీవే జీవం=నీవే మార్గం శ్రీయేసుదేవా ॥శ్రీ
5. సిలువమీద వెలుగుయేసు=ఇలనుమాలో వెలుగుమయా ॥శ్రీ
6. చీకటంత తీసివెలుగు=రక్షణ వెలుగు రక్షణమీవే ॥శ్రీ

## 25

పల్లవి: ఓ నాధ నీ దర్శనభాగ్యము మాకెపుడుకల్గునో-
ఓ స్వామి నీ దర్శనభాగ్యము మాకెపుడుకల్గును॥

1. మగ్దలేనే మరియకు మొదటి దర్శనం =
మ్రొక్కె పాదములు మక్కువతోడ ॥ఓ నాధ

2. మోషేకు దొరికెనయ్యా మోక్ష భాగ్యము =
పొంద దర్శనమువలన పొందె భాగ్యము ॥ఓ నాధా

3. క్లేయో పలుకులకు కలిగె దర్శనం =
కన్నుమూసి తెరువగానే కలిగె భాగ్యము ॥ఓ నాధా

4. పరిశుద్ధుడైన పౌలుకు కలిగె దర్శనం =
దారిలో దొరికెను తమస్కుత్రోవలో ॥ఓ నాధా

5. దొంగకు దొరికెనయ్యా దొడ్డ భాగ్యము =
కలువరి గిరిమీద కడిగె పాదము ॥ఓ నాధా

6. ఇప్పుడో అప్పుడో మరెప్పుడో కని =
నీ దర్శనభాగ్యము మాకిపుడు కలిగెను ॥ఓ నాధా

## 26

ప: మనుజులారా మీకు యింత మమత యెందుకు-
కల్లుపైన మమత ఎందుకు॥

1. కల్లుకడకు వారలంత వెళ్ళసాగిరి=ఎంతోవింత
వెళ్ళసాగిరి ఎంతోవింత ॥మనుజు

2. పనికన్న బోదామంటే లేవచేతగాదంటివి =
కల్లుకన్నా బోదామంటే మెల్లమెల్లగ పదమంటివి ॥మనుజు

3. నెత్తి మీద గంపబెట్టి గంపలో నొక పొంగులొట్టి=వంగివంగి
బోవుట యేమి తొంగితొంగి చూచుటయేమి ॥మనుజు

4. సగము చినిగిన రవికదొడిగి చంకలో ఒక లొట్టిబెట్టి=
దాగుకొని బోవుటయేమి ॥మనుజు

5. చినిగిన రవికెకు చిప్పిరి నెత్తికి చింతలేదా=యెంతో వింత
చిన్నబిందెకు కల్లులేదని చింత జేయుదు రెంతో ॥మనుజు

6. మూడుకుచ్చాల నేములుంటే వాడవాడకు ద్రాగివచ్చిన
కనులకు తల్లిచెల్లెలు పెండ్లామటరా ॥మనుజు

7. తల్లి చాటున పిల్లతాగు పిల్లచాటున తల్లిత్రాగు = తల్లి
పిల్లకనులుమూసి తాగినట్లు కోడలుత్రాగు ॥మనుజు

8. సగము చినిగిన రవికెదొడిగి చంకలోనొక పొంగులొట్టిబెట్టి
సంతసంబు కల్లముకాడికి సాగిపోవుదురెంతో వింత ॥మనుజు

9. ఆలుమగలు త్రాగివచ్చి యిల్లంత గోలగోల-ఇంటిలోపలగోల
గోల-కూడుకొరకుమీరుఇంతగోడు జెందుదురెందుకయా ॥మ

## 27

పల్లవి: యేసయ్యాను మేమెపుడు దలంతుము =
యేసయ్యా అంటే మాకెంతో సంతోషము

1. పరలోకము విడని పుడమి కేతెంచెను =
పశువుల పాకలో శిశువుగా బుట్టె ॥యేసయ్యా

2. మానవులందరికి మరి మహిమ యిచ్చెను =
చాలమేలులు జేసి పాలన జేసెను ॥యేసయ్యా

3. మన పాపములకొరకు మనుజుడై వచ్చెను =
మరల మూడవనాడు మృతిగెలిచెను ॥యేసయ్యా

## 28

పల్లవి: ఎంత దయతో బిలిచితివి-యేసయ్యా నినుజూడ =
యేసయ్యా నినుజూడ ఎవరు నను రానివ్వరు॥

1. కరుణా నీ పిలుపునకు కఠినా నా గుండె గరిగె =
కఠిన నాగుండె గరిగె కారుణ్య రూపుడా ॥ఎంత
2. అవనిలో నెవరికైన అన్యాయము జేసితినో =
నాల్గంతలు చెల్లింతు నయముగ నా ప్రభువా ॥ఎంత
3. జగదీశ నా ధనము సగము బీదలకిత్తు-సగము
బీదలకిత్తు సంతోషముగ రాజా ॥ఎంత
4. జక్కయ్యా మేడిచెట్టు ఎక్కెను ప్రభునిజూడ =
పొట్టివాడైనందున చూడలేకపోయెను ॥ఎంత

## 29

పల్లవి: యేసన్న పేరువిన్న ఏమిబాధలేదురన్న=
యేసన్న రక్షణకొడుకు ఏ నరుడు దీనిగొన్న॥

1. దేవావతారుడొకడె దేవుండు యేసుడొకడె =
మన దేవుడేసుకొడుకో ఓ దేశప్రియులారా ॥యేసన్న
2. మన రక్షకుండు ఒకడేరక్షణమార్గమొకటే =
మన రక్షణ దేవ కొడుకో ఓ నాదుప్రియులారా ॥యేసన్న
3. యుగము జగమునందు దేవుండు యేసుడొకడే=
మన దేవుడేసు కొడుకో ఓ దేశప్రియులారా ॥ఎంత
4. కలియుగ పాపులంత కడకేగి రక్షణలివ్వ=
కడకవతరించె కొడుకో శ్రీ కరుణగల యేసయ్యా ॥ఎంత
5. అదుగదుగో మోక్షపురము అందుండు అందుండు యేసు
జన్మము:=అదుగదుగో రక్షణకొడుకో అదిదైవభక్తులకెరుక ॥ఎంత

6. పరలోక ప్రార్థన నిన్ను పరిశుద్ధపరచగలదన్న ప్రభు యేసు స్వామి పాట మనము పాడుచుందుమురన్న ॥ఎంత

7. పాపులకొరకు యేసు ప్రాణంబు బెట్టినాడు = పరమాత్ముడేసు కొడుకో ఓ పాప ప్రజలారా ॥ఎంత

8. నిజమైన దేవుడు కొడుకో నీతి లేని ప్రజలారా మన పరమాత్ముడేసుకొడుకో ఓ పాప ప్రజలారా మన దేవుడేసుకొడుకో ఓ దేశ ప్రియులారా ॥ఎంత

# 30

పల్లవి: నీదే రాజ్యము నీదేమహిమ నిరంతరమునీవేగ నిరంతము నీవేగ=ధరణినుండు జీవులకెల్ల -జీవాధారము నీవేగ నా ప్రాణాధారము నీవేగా

1. పాపరోగములెక్కువాయె-ప్రాణమునకు ముప్పాయే-లోకమునకు అప్పాయె-పరమతండ్రివి దిక్కు-నీవే రక్షించి నీ దయచేత రక్షించుము నీ దయచేత ॥నీదే

2. మదమత్సరములను మరిగి-మరచిపోతిమి నీ సేవా -మరచిపోతిమి నీ సేవా = మరువకుండ నీదు మంచి గురుతు నా మదినుంచయ్యా గురుతు నా మదినుంచయ్యా ॥నీదే

3. లోక ఆశలబడి చాల మోసమై చెడిపోతిమి మోసమై చెడిపోతిమి=లోక ఆశలనుండి మమ్ము దీసి రక్షించు యేసయ్యా దీసి రక్షించు యేసయ్యా ॥నీదే

## 31

పల్లవి: ఓ ఓ ఓ యింత కాలము వింతగనను యేసాధరణిలోవింతగ
సాకితివి॥ ఇకముందు నాతో నుండి యిడుములదొలగించి
వంకర గుణములు మరియును చెడు యాటంకము
లను బాపి కాయము సంకటములు బాపి

1. ఆకలి కాదు అన్నముబోదు ఆయాసముగలదు నాకిది
బాధ కృపనాథా నీ కది ఎరుక గదా ॥ఓ

2. ఆరు నెలలు యీ జబ్బుతో నేను పోరుసల్పుచుండి-
కారణ మెరిగిన మానవుడొక్కడు కానరాడు నాకు
నీదే బారము నా ప్రభువా ॥ఓ

3. బొమ్మను జేసిన కుమ్మరివని నినునమ్మితి శాంతముగా
సమ్మతిగాను నాసంగతి నెరిగిన సర్వజ్ఞాని నీవే గట్టిగ-
నమ్మితి నీవేగతి ॥ఓ

4. పాపములను క్షమించు-ముందుగ బాధను
దీయుమయా = నాపై నీ కృప జూపనిచో ఓపుగజాలనిదే
దేవ నీ కాపద సాక్షిగాను ॥ఓ

5. మాటమాత్రము దాటనిమ్ము నీ నోటినుండి ప్రభువా
సూటిగానున్న కొటిరోగములు బాటపట్టునిపుడే-
అంత నీ గోటిలో నున్నదిరా ॥ఓ

6. ఆశగలదు విశ్వాసము తక్కువదోషము నాదేకదా -
దోషరహితునిగా జేసి నన్ను నీ దయచేసి నీ కరుణజూపు
నా విశ్వాసము బలపరుచు ॥ఓ

7. మందికి జెప్పెను మనసు లేదు నీ యందు సమ్మతిని
మందికి జెప్పితె వందలు కావలె మందుఖర్చుకు
అటుపై బొందబోయెగతి తుదకు ॥ఓ

8. ఏవి పడితె అవి తినియెడు యీ నాధుల చెంచులకు-
యేదో అడవిలో ఏ. బి. విటమిను సూదిమందులనగా-
వారికి ఎవరు దిక్కు ప్రభువా ॥ఓ

9. ఎలుకలు ఉడుతలు ఎపుడు భుజించెడు ఎరుకలు
ఒడ్డెలు=ఎన్నడు మందులు ఎరుగరు కొందరు-
ఏమని జెప్పుదును-వారిని ఎవరిక గాయుదురు ॥ఓ

10. అందుకొరకే నా యాశనంత నీ-యందు నిలుపుకొని-
సందియమేమి సాగనియ్యక-సర్వము నీవట నీ-
ప్రభు నీ సన్నిధి జేరితిని ॥ఓ

11. ఎవరికి జెప్పిన ఏమిలాభము-యేమి చేయగలరు-
అవి ఇవి తినుమని అటు యిటు బొమ్మని అందురు
పెదవులతో అటుపై అవతల దాటుదురు ॥ఓ

12. నీకు మించిన వైద్యుండిలలో నాకు గానరాదు -
నాకీ జబ్బు యే కారణమో నీకు మాత్రమెరుక -
ప్రభు నీ బలము నాకు ఎరుక ॥ఓ

13. నిన్ను నమ్మితి నీవే గతియని-నన్ను బాగుచేయు -
యెన్నగ నాలోనున్న పాపములు-అన్నియు క్షమి
యించి పిమ్మట చిన్నవాని బ్రోవు ॥ఓ

14. భక్తులంత నా బలహీనతకై -బహుగను చింతించి -
ప్రార్థనచేయగ బాధ తగ్గినది-ప్రభువా స్తోత్రము-
కొద్దిగ బలము కలుగుతుంది ॥ఓ

15. ఎంత సేవ నేనెట్లు జేసితినో యేమి తృప్తిలేదు=
ఎంతమందిని రక్షించితివో-ఎరుక లేదు నాకు-యేసువ
అంత ఎరుక నీకు ॥ఓ

16. వందలకిల బాప్తిస్మములిచ్చి-గ్రంథములను వ్రాసి-
ఎందరికో పలుబోధలు జేసి-ఎంతయో మురిసితివి-
అందులో ఎందరు నీ వారో ॥ఓ

17. చాలుచాలు నాకేల లోకము-గోలకే ప్రభువా -
చాలును పాపము చాలును పాపముజోలికి జేర
నయ్యా-యిక బహుకాలము దాటెనయ్యా ॥ఓ

18. గట్టిగ నను చేపట్టుము యిక నీ పట్టులోనుండు
నయ్యానెట్టకు వెళ్ళగొట్టకు-గొట్టిన నేనెటుల
బోదునయ్యా-సూటిగా నా గృహామీవే గదా ॥ఓ

## 32

పల్లవి: చెప్పలేను నా బాధ యేసు నాధా-నా చేతులు కాళ్ళు
చూడు యేసునాధా

1. నా పాపముచేత యేసునాధా నాకీఫలమె దొరికింది
యేసునాధా
2. కుష్టురోగము చేత ,, బహుకష్టపడుచున్నాను ,,
3. మేహాపొడలచేత ,, నా దేహామంత జెడెను ,,
4. వేళ్ళన్ని యూడినవి ,, నా కాళ్లుచేతులుచూడు ,,
5. కొరుకుడు పుండ్లని ,, నా కరపాదములదినెను ,,
6. ఊరిలోనె ఉండరాదు ,, ఏ దారిలోన-నడువరాదు ,,
7. తల్లిదండ్రులుగూడ ,, నన్ను వెళ్ళగొట్టినారు ,,
8. కన్నబిడ్డలైతేను ,, నన్నుకన్నులెత్తిచూడరింత ,,
9. నా భార్య నన్ను జూచి ,, నాపక్కదొలిగిపోయెనయ్యా,,
10. అంటరాని వాడనని ,, నేనంటేనే ఓర్వరింత ,,
11. ఉండనింత గుడిసెలేదు ,, నాకు పండనింత జాగలేదు ,,
12. బావివద్దు చెరువువద్దు ,, నాకు బైటనున్న వాగువద్దు ,,
13. యేమిముట్టరాదునేను ,, నాకు చావుమేలు దీనికన్న ,,
14. అడవిలో నివాసమయ్యా,, నాకు ఆకులలమె భోజనము ,,
15. అంటరానివాడనని ,, నా ఇంటివారె తరిమినారు ,,
16. తిండి యింతదొరికితేను ,, నాకు తినుటకైనచెయ్యిలేదు ,,
17. ఇట్టి బ్రతుకు బ్రతికితేను ,, నాకుఇంకను లాభమేమిలేదు ,,
18. ఇష్టమైతె నీకు నేను ,, నా కుష్ఠురోగము మాన్పు ,,
19. దయగల దేవుడవు ,, నీ దయ నాకు జూపించు ,,

20. ఎంత మేలు ఎంత సుఖము కుష్ఠిరోగి నీ సంతోష
మెక్కువాయె కుష్ఠిరోగి
21. సాక్ష్యమియ్య మొదలు పెట్టె కుష్ఠిరోగి తన స్వామి
యొక్క దయనుగూర్చి కుష్ఠిరోగికి
22. అలాగే మనమంత అన్నలారా పెద్ద ఆత్మరోగ
మున్నదండి అన్నలారా
23. పాపరోగము మనల అన్నలారా చాల బాధించు
చున్నదండి అన్నలారా
24. నన్నయితే రక్షించె యేసునాథుడు నాకున్న
రోగముదీసె యేసునాథుడు
25. ఇష్టమున్న వారికే యేసునాథుడు పాప కుష్ఠు
దొలగించు యేసునాథుడు
26. ఇప్పుడే నమ్మండి యేసునాథుని-మిమ్ము తప్పక
రక్షించు యేసునాథుడు

## 33

పల్లవి: కరుణగల శిరమునుండి కారెర క్తంబులోన=
నను గడుగ రావయ్యో నా యేసునాథుండా =
ననుదుడువ రావయ్యో నా యేసునాథుండా॥

1. కరముల రెంటినుండి కారేర క్తంబులోన ॥నను గడుగ
2. ప్రక్క గాయములనుండి పారే ర క్తంబులోన ॥నను గడుగ
3. పాదముల రెంటినుండి పారే ర క్తంబులోన ॥నను గడుగ
4. పంచగాయములనుండి పారే ర క్తంబులోన ॥నను గడుగ
5. సిలువమీద నన్ను ఖలుని సహా గడిగినావు ॥నను గడుగ
6. మరణ పర్యంతము నీ ప్రేమ మరువము తండ్రీ ॥నను గడుగ

## 34

పల్లవి: యేసు మాటలోన ఎంతో బలమున్నది స్వామి
మాటలోన చాల శక్తున్నది యేసు మాట
లన్నియు కోటిరూకల మూట॥

1. కానానుపురములో కడు పెండ్లి సమయమున =
నీళ్లను ద్రాక్షరసముగ మార్చినది ఆమాట ॥యేసు

2. గలిలయ్య సముద్రములో వలవేసిరి శిష్యులు=
వలలు పిగిలినదాక చేపల్ పట్టిన మాట ॥యేసు

3. నీళ్లపై పేతురు ఏ రీతిగ నడిచెను =
ఏ రీతిగ నడిచెను యేసు మాటవలన ॥యేసు

4. పదిమంది కుష్టురోగులు ఎదురంగ రాగానే=
ఇష్టంబుతో ముట్టి స్వస్థపరచినమాట ॥యేసు

5. ఐదు రొట్టెలు మరియు రెండ చేపలతో =
ఐదువేల మంది కాహారమిడు మాట ॥యేసు

6. పక్షవాయువు రోగి పరుపుమీద బడియుండగా =
పరు పెత్తుకొని నీవు వరుగెత్తుమను మాట ॥యేసు

7. మూడురోజులాయె మురిగి వాసనబట్టె =
లాజరు లెమ్మని చెప్పినది యా మాట ॥యేసు

## 35

పల్లవి: రావయ్య యేసయ్య రారాజు క్రీస్తయ్య=
మమ్మేలి రక్షింప రావో యేసయ్య॥

1. అన్ని బొమ్మల మ్రొక్కి మన్ను పాలైతిని=
కన్న తండ్రివి నీవే రావో యేసయ్య ॥రావయ్య

2. పాపభారముచేత నీవు వంగిపోయె =
కాపాడి రక్షింప రావో యేసయ్యా ॥రావయ్యా

3. దొంగగురువులనమ్మి భంగమైతిని నేను=
నింగి రక్షకుండ రావో యేసయ్యా ॥రావయ్యా

4. యేసన్న పేరును యోసేపు దెలిపెను=
క్రీస్తు దాసుడను రావో యేసయ్యా ॥రావయ్యా

5. క్రీస్తు దాసునకు దొరికెను భాగ్యంబు=
మోసగుణములు దీయరావో యేసయ్యా ॥రావయ్యా

6. యేసుగతి లేనిది నాశనమైపోయే=
ఆశలన్ని దీరె రావో యేసయ్యా ॥రావయ్యా

7. జయము జయము యేసు రాజుకు జయమని-
జయగీతము పాడేదాము యేసయ్యా ॥రావయ్యా

## 36

పల్లవి: నమ్మకు జీవాదాని మహిమలో నీదు బ్రతుకు-
నమ్మకు జీవా = దానిమ్మ ముండ్లు
తుమ్మకంప నమ్మకు జీవా॥

1. తొమ్మిదిరంధ్రముల బొమ్మ-ఘనమైన తోలుబొమ్మ=
యేకష్టమైనగాని దమ్మిడి లాభంబులేదు ॥నమ్మకు

2. రకరకముల నగలు బెట్టుట-పకపక నవ్వేరుగాని=
పకపక నవ్వేరుగాని ఫలమేమి లేదు జీవ ॥నమ్మకు

3. ఇల్లు వాకిలి నాదియనకు-ఇల్లాలు నాదియనకు =
వెళ్లిపోయేటప్పుడు వెంట నేదియురాదు ॥నమ్మకు

4. పంటపైరు నాదియనకు-పశువుల నావియనకు=
కంసె కడియాలు విడిచి జంటలేక వెళ్ళవలెను ॥నమ్మకు
5. ఎత్తుకబోయ్యేది నల్గురు-నీ వెంట వచ్చేది పదుగురు=
ఒంటిగా నిన్నకడ విడిచి ఇంటికి వత్తురందరు ॥నమ్మకు

## 37

పల్లవి: పరిశుద్ధమైన నీ నామము-పరిశుద్ధమైన నీ నామము=
పరలోక రాజ్యములో మరి మహిమ పర్చబడున్
యెహోవ పుత్రుడ యేసయ్యా॥

1. ఎన్నిక లేనివానివలె-ఎన్నిక లేనివానివలె= కన్య మరియ
గర్భమున నీవు ధన్యుడవై జన్మించితివయ్యా
యేహోవ పుత్రుడ యేసయ్యా ॥పరిశుద్ధ
2. పండ్రెండేండ్ల ప్రాయమున-పండ్రెండేండ్ల ప్రాయమున=
పరిసయ్యుల మధ్యన నీవు మర్యాదగా నడచితి
వయ్యా యెహోవ పుత్రుడ యేసయ్యా ॥పరిశుద్ధ
3. ముప్పదియేండ్ల ప్రాయమున ముప్పదియేండ్ల ప్రాయమున=
యోర్ధానను నదిలోన నీవు తప్పక స్నానము బొందితి
వయ్యా యెహోవ పుత్రుడ యేసయ్యా ॥పరిశుద్ధ
4. చేయుచు నీ తండ్రి సేవ చేయుచు నీ తండ్రి సేవ=
చేరి నీదు శిష్యులతో నీవు ఊళ్ళలో బోధించితి
వయ్యా యెహోవ పుత్రుడ యేసయ్యా ॥పరిశుద్ధ
5. పరిశుద్ధమైన పాదములు పరిశుద్ధమైన పాదములు=
చురచురయని కాలంగా నీకు బురబుర బుగ్గలు
బుట్టునుగాదే యెహోవ పుత్రుడ యేసయ్యా ॥పరిశుద్ధ

## 38

పల్లవి: యెవరు రారువెంట-నీ కెందుకు తెలియదు యేలరతంట॥

1. అవి యివి నాయని అదిరిపడకుము ఎవరిక నేనని
ఎగిరిచడకుము-భువిధనమంతయు బూడిద సమము-
శవము మాత్రమే చేరునాస్థలము

2. భార్యయున్నదని భ్రమసెదవేమో-బంధువులుగలరని
పలికెదవేమో-తనయులుగలరని తలచెదవేమో-
తమ్ములుగలరని నమ్మెదవేమో ॥యెవరు

3. యెద్దులావులని ఎగిరి పడకుము-మిద్దెమేడలని
మిడిసిపడకుము-పెద్దలుజెప్పగ ప్రేమతో వినుము -
అద్దినమున నెందు మొద్దులేగాని ॥యెవరు

4. చెల్లెను ఘనముగ చెప్పుకొందువు-తల్లిపిల్లలకు
దయనుజూపరు-వల్లకాటిదాకవచ్చి చూతురు-
కల్లుత్రాగి తమ యిండ్లకు బోదురు ॥యెవరు

5. నీ పైబట్టలు నీతోరావు-నీ భార్యయు పిల్లలు
సహారారు=నీకున్నది మరి యేదియురాదు-
నీతో-వచ్చు నీ పాపములే ॥యెవరు

6. పాపము దీసెడి ప్రభువును గనుము-ప్రాణముండగనే
పరుగిడు చనుము-ప్రభుయేసా నీ గతి నీ వనము -
పరులమాట నమ్మకు యిది వినుమా ॥యెవరు

## 39

చాయ: చల్లనిరాజ ఓ చందమామ.

పల్లవి: యేసు ప్రభువా! ఓ యేసుప్రభువా!
నీ విషయాలు తెలిశాయి ఓ యేసు ప్రభువా!
నా యేసుప్రభువా! ॥యేసు

1. నీకైనను యెవరైంది నాకైనను
మొట్టమొదలైన నాకైన తెలియలేదూ
ఇప్పుడైనా నా ప్రభూ
నాకైనను నీవైన తెలిసేప్రభూ ॥యేసు

2. నిజముగాను నీవైన యుందువులే
విశ్వాసులవారీ, ఆత్మాలలో
నిజముగా ప్రభూ
విశ్వాసుల ఆత్మాయే నీ ఆత్మతే ॥యేసు

3. ఎప్పుడైనను నేనైన బంటుగను
నీ వాక్యంలో నుందునేనైనను
యిప్పుడైన ప్రభూ
నేనైనను యిక మర్వలేనూ ప్రభూ ॥యేసు

## 40

పల్లవి: చిన్నవాడా యిటుల జేస్తే-కన్నకడు పెటులనోర్తు-
యెన్నరాని పాట్లుబడితివిరా-నన్నుగన్న జనకా

1. నన్నుగన్న జననీ-వినవే-కన్నుల జాడలు నీకు -
చిన్నగా కాలువలెందుకే-ఓ మా అమ్మ ॥చిన్న

2. అమ్మను విడువకు కొడుకా-యిమ్మహిలో నీదు బ్రతుకు
సమ్మతముతోడ నుండుమురా నా చక్కనయ్యా ॥చిన్న
3. లేతప్రాయమని నీవు-భీతిజెందినావే మాత-
ఏ తీరు వ్రాత వ్రాసితే ఓ మాయమ్మా ॥చిన్న
4. పస్కాకు వచ్చి మేము-పయనమై-వెళ్లుచుండ-పని
యేమున్నదని పురమున నా పసిడిబొమ్మ ॥చిన్న
5. దినమంత నడిచి-దిగులొందినాము కొడుకా-
సగము ప్రాణము బోయెరా నా చక్కనయ్యా ॥చిన్న
6. కాలువలై పారగానే-నెళవలై యుందుతనయ-
పాలు మెున్నమరచినావురా నా పసిడిబొమ్మ ॥చిన్న
7. పాలు మానితే నీకు మాత-మేలు నీకు గదనేమాత-
బాల తొందరులు బోయనే ఓ యమ్మా ॥చిన్న

## 41

పల్లవి: యీ రెండు చేతులు దేవుండు ఇచ్చెను.
ఇచ్చినట్టి దేవునికి ఇటుల మ్రొక్కుదు॥

1. యీ రెండు కాళ్ళను దేవుండు ఇచ్చెను-
ఇచ్చినట్టి దేవునికి గుడికి ఇటులనడుతుము ॥యీ రెండు
2. ఈ రెండు చెవులను దేవుండు ఇచ్చెను
ఇచ్చినట్టి దేవుని మాట ఇటులవిందుము ॥యీ రెండు
3. మేటి దేవుడు యీ నోటినిచ్చెను
ఈ నోటితోడ దేవుని పాటపాడెదము ॥యీ రెండు
4. సంతసంబుతో నాదంత ఇత్తును
మన స్వంత ప్రాణమిచ్చినట్టి స్వామి యేసుకు ॥యీ రెండు

**42**

పల్లవి: పాపరోగానికిమందు మీరు పరుగెత్తితినకుంటె దొరుక
దికముందూ॥

1. పాపరోగానికి బహుమంచిదీమందు నీ
పాపములుదీయ నీతిగలమందు ॥పాప

2. యెన్ని గుణములకై నవన్నె కెక్కిన మందుతోను
సేవించినా తగు సౌఖ్యమందు ॥పాప

3. బొమ్మపూజలు దైవబోధల నియమించు
నమ్మగులకెల్ల నాణ్యమౌ మందు ॥పాప

4. పాపాంధకారమున పడియున్న వారిని
కాపాడి రక్షించు కరుణగలమందు ॥పాప

5. పరిగమేముల బంగి దాగుచు దిరుగు
దొంగగురువులకెల్ల దొడ్డదీమందు ॥పాప

6. పసిపిల్లలకు మరియు పడుచువారికి నిదియే
ముసలివారికి సహా ముఖ్యమీమందు ॥పాప

7. యెప్పుడడిగిన వారికప్పుడే దొరుకును
ఇప్పుడే దీనిని తప్పక గనుగొనుడి ॥పాప

8 రెండు వేల ఏండ్లకు ముందుగా యీ
మందు దండి దేవునియొద్దనుండి వచ్చెనుగా ॥పాప

9. నీ మీద నా మీద నిజమైన ప్రేమచే
ఆ మీద దేవుండు అది పంపె మనకు ॥పాప

10. నరక శాపమునుండి నరులను రక్షింప
పరలోక పరలోకమునుండి పంపెనుమందు ॥పాప

11. సిలువపై యీ మందు చిందింపబడెమందు
విలువగల నీ యాత్మ విముక్తిపొందు ॥పాప

12. యీ మందును మించి యేమందులేదయ
యీ మందు త్రాగితే నిజమైన శాంతి ॥పాప

13. పరమవైద్యుడు క్రీస్తు పాపులే రోగులు
తన రక్తమే మందు తక్షణమే గొనుడి ॥పాప

14. యేసు క్రీస్తు నిన్ను దోషరహితునిగ జేసి
భాసురంబుగ మోక్షవాసమిచ్చునుగా ॥పాప

15. జీవించియుండగనే నీవు దినవలేదీని
ఆవలదొరుకదు ఇసుమాత్రమైనా ॥పాప

16. గనుక నా రక్షకుని కడుభక్తితో నమ్మి
అనిశము నీ హృదయమాయనకు నిమ్మా ॥పాప

**43**

పల్లవి: దేవునినమ్మిన దీనులైనవారికి
యేమేమో తెల్పుమ ఓ బాల తెల్పుమా

1. మొదటిది దేవుండు మొదటిది దేవుండు
ఒకదేవున్నాడే ఓ జనులారా మనకు ॥దేవుని

2. రెండవది బొమ్మలకు రెండవది బొమ్మలకు
మొక్కవద్దనెడి ఓ జనులారా మనల ॥దేవుని

3. మూడవది దేవుని పేరు మూడవది దేవుని పేరు
పలుకవద్దనెడి ఓ జనులారా మనల ॥దేవుని

4. నాల్గవది ఆదివారము నాల్గవది ఆదివారము
పరిశుద్ధమున్నాడే ఓ జనులారా మనల ॥దేవుని

5. అయిదవది తల్లి దండ్రులు అయిదవది తల్లి దండ్రుల
ప్రేమించుచున్నాడే ఓ జనులారా మనల ॥దేవుని

6. ఆరవది ఒకరిని ఆరవది ఒకరిని చంప
వద్దన్నాడే ఓ జనులారా మనల ॥దేవుని

7. యేడవది వ్యభిచారము యేడవది వ్యభిచారము
చేయవద్దన్నాడే ఓ జనులారా మనల ॥దేవుని

8. యెనిమిదవది దొంగతనము యెనిమిదవది దొంగ
తనము చేయవద్దన్నాడే ఓ జనులారా మనల ॥దేవుని

9. తొమ్మిదవది అబద్దసాక్ష్యము తొమ్మిదవది అబద్ధ
సాక్ష్యము పలుకవద్దన్నాడే ఓ జనులారా మనల ॥దేవుని

10. పదవది పరులసొమ్ము- ఆశింపవద్దన్నాడే
ఓ జనులారా॥ మనల. ॥దేవుని

## 44

పల్లవి: నమ్మండి నమ్మండి నరులారా వినుడి = శ్రీ
యేసయ్యను నమ్మండి జనులారా మీరు - శ్రీ
భగవంతుని నమ్మండి ప్రజలారా మీరు

1. ఆకాశ మెరసినాయె నరులారా వినుడి = అయ్యో
ఆరు మతములొక్కటాయె జనులారా వినుడి ॥నమ్మండి

2. పట్టపగలు చుక్కబొడిచె నరులారా వినుడి=అయ్యో
పట్టరాని శోకమయ్యో జనులారా వినుడి ॥నమ్మండి

3. తూర్పున చుక్కబొడిచె నరులారా వినుడి=అయ్యో
పెద్దబండ పగిలెగదా జనులారా వినుడి ॥నమ్మండీ

## 45

పల్లవి: మన యేసుజాతరా-మరలవచ్చిందయ్యా=మరల
వచ్చింది మనమెళ్లి చూతమయ్యా॥

1. పాపభారము మోయు పాపులందరిని=దాపు
నకు రమ్మని దయతోను బిలిచెను ॥మన
2. చిన్న కానుకలతో చెంతకేగెదము=చెంత
కేగినయెడల చింతబాపును ॥మన
3. వచ్చిన గురువులెల్ల హెచ్చుగ దీవింతురు=
వచ్చే యేడాదిదాక హెచ్చుగ వర్ధిల్లను ॥మన
4. మన గ్రామమునకు వెళ్లి మానుగ ఆ మధ్య=మన
యేసు దేవుడంచు మానక ప్రకటింతుము ॥మన

## 46

పల్లవి: ఇదిగో ఇదిగో దేవుని వార్తా-ముదమున దెల్పెదము=
ఇదిగో ఇదిగో సిలువ పతాకము-ఇది యొక
మోక్షమార్గము జూపును ॥

1. యేసేదైవము యేసే జీవము- యేసే మార్గమిల=యేసే
లోకపు రక్షకుడతడే - యేసుగాక యింకెవరు లేరిక ॥ఇదిగో
2. వేదము పరిశీలించుము ఇదిగో - వేసారక నిపుడే = వేదము
పలుకగ కలిగెను రక్షణ-యేసుని నమ్మినవారలకిపుడే ॥ఇదిగో
3. నమ్మితిరా ప్రభుయేసుని నామము-నెమ్మది
గలుగుగదా = నమ్మినవారల ద్రోయడు తండ్రి -
సమ్మతి సుతులను పిలుచును సతతము ॥ఇదిగో
4. పాపదాహము తీరునురండి - పాలుమాలకిపుడే=పాపుల
స్నేహితు రక్షకుడేసు-పరుగెత్తుచు పదరండి ॥ఇదిగో

**47**

పల్లవి: జయజయ యేసు-జయజయ క్రీస్తు-
జయ క్రీస్తు=జయజయరాజా-జయరాజా -
జయజయస్తోత్రము - జయస్తోత్రము

1. మరణము గెలిచిన జయయేసు-మరణము ఓడెను
జయయేసు=పరము ఒలమొసగు జయయేసు -
శరణము నీవే జయయేసు ॥జయ
2. సమాధి గెలిచిన జయయేసు-సమాధి ఓడెను
జయయేసు=క్షమించుమునను జయయేసు -
అమరమూర్తివి జయయేసు ॥జయ
3. సైతాను గెలిచిన జయయేసు - సాతాను ఓడెను
జయయేసు=పాతవి గతించె జయయేసు -
ధాతవు నీవే జయయేసు ॥జయ
4. బండను గెలిచిన జయయేసు - బండయునోడెను
జయయేసు-బండలు దీయుము జయయేసు
అండకు జేర్చుము జయ యేసు ॥జయ
5. ముద్రను గెలిచెను జయయేసు-మద్రియు
నోడెను జయయేసు=ముద్ర జీల్చుము జయ
యేసు-ముద్రించుము నను జయయేసు ॥జయ
6. కాపును గెలిచిన జయయేసు - కావలి ఓడెను
జయయేసు= సేవలో బలమును జయయేసు
జీవము నీవే జయయేసు ॥జయ
7. దయ్యాల గెలిచిన జయయేసు=దయ్యాల
ఓడెను జయయేసు=కయ్యము గెలిచిన జయ
యేసు-అయ్యా నీవే జయయేసు ॥జయ

౮. పాముల గెలిచిన జయ యేసు—పామును ఓడెను
జయ యేసు—అది ప్రజలలో వచ్చెను జయ యేసు -
దాని నోటినిగొట్టెను జయ యేసు

## 48

పల్లవి: ఆశీర్వదించుమా -మా తండ్రి యేసు నా-మమ్మును-
గావుమా - మాతండ్రి యేసువ మమ్మును గాతువని
ఇందె నిలిచితిమి ॥మమ్మును గావుమా॥

1. ఈ సృష్టిలోపల పాపులమైన మమ్ము మా
పాపంబులన్ని బాపి మమ్ము శుద్ధపరచుమా ॥మమ్మును
2. మా పనులలోపల మాకుతోడై యుండి
నీ శక్తి నిమ్మ యా నిరతంబు మాకును ॥మమ్మును
3. అడుగక ముందే నీవు అన్ని యిత్తువాని,
సందేహమేమి లేక-సంతృప్తిపరచుమా ॥మమ్మును
4. ఇట్టి మా నమ్మకము నిరతంబు మాయందు-
స్థిరపరచి మాయందు దృఢముగ జేయుమా ॥మమ్మును
5. అడిగిన యిట్టి మా యీవులన్నియు -
అతి త్వరలో నిత్తువని ఆశించుచుంటిమి ॥మమ్మును

## 49

పల్లవి: ఓ ఓ మనసా మారుమనస్సు కలిగెనా-మనసు కలిగెనా
మారుమనసు గలిగెనా-నీవుమార్పబడితివా లేదా...ఓఓఓ

1. పైన శ్రేష్ఠునివలె నటించి-లోన బ్రష్టునివలెనుండిన-
నీ నటనా వీడు వేషధారణవీడు-నీకుటిలంవీడు ॥ఓ
2. ప్రభు నీలో నివసించనట్లయిన-నీ మనస్సే మారనట్లయిన
ప్రభువచ్చి వ్యర్థము మృతిని గెలిచి వ్యర్థము
రక్షణజూపి వ్యర్థము ॥ఓ

3. ఆత్మఫలములు నీలో లేకున్న-విమల హృదయము
నీలో లేకున్న ఆత్మానందము సున్న మోక్షభాగ్యముసున్న ॥ఓ
4. ప్రభునిమీదనే - ప్రకాశించె - తనయాత్మ నీపై
గురిపించె-ప్రభుని ప్రేమజూడు దీర్ఘ శాంతముజూడు-
ప్రభుని కొనియాడు ॥ఓ ఓ ఓ
5. ప్రభువరుదెంచు సమయమే తెంచె-నీ జీవితయాత్ర
ముగించె-నీ యాశలీడేరు-నీ జన్మముసిద్ధించు -
నీ మోము చిగురించు ॥ఓ ఓ ఓ
6. నీ యనుదిన జీవితమందు-నీ భారమాయనమీద వేయు
ప్రభుని సమీపించు - నీ విధియనియెంచు విభుని
తేజముగాంచు ॥ఓ ఓ ఓ

## 50

పల్లవి: నా॰ యేసునామమూ నా మనోధ్యానము - నా
యనంతరాయుడు నా మహోన్నతుడు
నాయన్న చూడ దైవనందుడు - నా ప్రాణబంధుడు
॥నా యేసు

1. ముఖ్యుండైనవాడు-విముక్తి కర్త రక్షకుండు -
వాక్యముఇమ్మాను యేలు-బాలుడు-వందనశీలుడు॥నా యేసు
2 సర్వోన్నతమైనవాడు-చావును జయించినవాడు-సర్వ
జనులు నీతికోర్కె. సూర్యుడు మేరి కుమారుడు నా ॥యేసు
3. ప్రధాన యాజకుండు ప్రజలసాక్షి గొర్రెపిల్ల యూద
గోత్రంబులోని సింగము ఆదర్శనశృంగము ॥నా యేసు
4. అల్ఫాయు ఓ మేగ ఆదియంతమైనవాడు-ఆలోచన
కర్తనజరేయుడు ఆదాము దేవుడు ॥నా యేసు

## 51

పల్లవి: సత్యవేద గ్రంథము దీని సత్యంబు గొనియాడరె ॥సత్య

1. వన్నెల వన్నెల గ్రంథము దీని కొన్నవారే ధన్యులు ॥సత్య
2. న్యాయంబు కావలసిన నిత్యన్యాయంబు లందించులో ॥సత్య
3. భాగ్యంబు కావలసిన సత్యభాగ్యంబు గలదిందులో ॥సత్య
4. ప్రేమగల మన దేవుడు తన ప్రేమచే మనకోసమగును ॥సత్య
5. ముక్తి నొందగోరిన దాని భక్తిచే చదువవలెను ॥సత్య

## 52

పల్లవి: పుట్టినాడు యేసు నా కొరకు పుట్టినాడు యేసు -
నీకొరకు పుట్టినాడు యేసు మనకొరకు
పుట్టినాడు యేసు। పుణ్యదారినిజూప-
పుణ్య దారినిజూప నాకొరకు - పుణ్యదారినిజూప-
నీకొరకు పుణ్యదారినిజూప మనకొరకు ॥

1. పుట్టినాడు యేసు రక్షణ మార్గముజూప నాకొరకు
రక్షణ మార్గము జూప నీకొరకు-రక్షణ
మార్గము జూప మనకొరకు
2. పుట్టినాడు యేసు మన పాపములుదీయ మన
పాపములుదీయ నాకొరకు మన పాపములుదీయ
నీకొరకు-మన పాపములుదీయ మనకొరకు॥
3. పుట్టినాడు యేసు మనుజావతారమున-మనుజావ
తారమున నాకొరకు మనుజావతారమున నీకొరకు -
మనుజావతారమున మనకొరకు

4. పుట్టినాడు యేసు పరిశుద్ధాత్మ ద్వారా-పరిశుద్ధాత్మ
ద్వారా నాకొరకు పరిశుద్ధాత్మద్వార నీకొరకు-
పరిశుద్ధాత్మద్వార మనకొరకు ॥

5. పుట్టినాడు యేసు మరియమ్మ గర్భమున మరియమ్మ
గర్భమున నాకొరకు మరియమ్మ గర్భమున నీకొరకు
మరియమ్మ గర్భమున మనకొరకు ॥

6. పుట్టినాడు యేసు బేతాలేమూరిలోన-బేతాలే
మూరిలోన నాకొరకు-బేతాలేమూరిలోన నీకొరకు-
బేతాలేమూరిలోన మనకొరకు ॥

7. పుట్టినాడు యేసు పశుల పాకలోన-పశుల
పాకలోన నాకొరకు-పశుల పాకలోన
నీకొరకు-పశులపాకలోన మనకొరకు ॥

8. పుట్టినాడు యేసు పరలోక దారిజూప-పరలోక
దారిజూప నాకొరకు-పరలోక దారిజూప నీ
కొరకు-పరలోక దారిజూప మనకొరకు ॥

9. పుట్టినాడు యేసు బీదవారింటిలోన-బీదవా
రింటిలోన నాకొరకు-బీదవారింటిలోన నీ
కొరకు-బీదవారింటిలోన మనకొరకు॥

10. పుట్టినాడు యేసు ఆత్మ రక్షణకొరకు -
నాకొరకు-ఆత్మరక్షణ కొరకు నీకొరకు
ఆత్మ రక్షణకొరకు మనకొరకు ॥

## 53

పల్లవి: వినరండి యో సోదరులారా-వినరండి మీరు-
వింటెను మీకు మోక్షము దొరుకును-మీరువినరండి

1. తప్పుడు బోధలు చెప్పెడు గురువులు-తగిలితేనే
నోరయ్యా=చెప్పిన విధమున-దేవుని దాపుకు-
చేరితివంటే మేలయ్యా ॥వినరండి

2. బ్రతికియుండగనే-దేవుని తెలుపక బ్రతికితి
వంటె మేలయ్యా=బ్రతిమాలిన నిదినమ్మక
పోతే-బాధలు నొందెదవోరయ్యా ॥వినరండి

3. సత్యంబేది యను నసత్యంబేది యను-
సంగతి నెరిగితే మేలయ్యా సత్యవంతుడగు
దేవుని మ్రొక్కక చచ్చితెనరకమే వోరయ్యా ॥వినరండి

4. బీదసాదలను దిట్టక దేవుని బోధను వింటె
మేలయ్యా-బాధలు పెట్టుచు-వదురుచునుంటే-
వచ్చును నరకము వోరయ్యా ॥వినరండి

5. యేసు క్రీస్తును దేవుండని యెరిగితివంటే
మేలయ్యా=మోసగురువుల నమ్మితివంటే-
మొదటికి మోసము వోరయ్యా ॥వినరండి

6. లోకాశలలో బ్రతుకుచునుంటే-
వచ్చును నరకమే వోరయ్యా సత్యదేవుని నమ్మితివంటే -
రక్షణ దొరుకును వోరయ్యా ॥వినరండి

## 54

పల్లవి: నరులారా ఈ లోకమును-నమ్మబోకుడి
ప్రియులారా ఈ లోకమును-నమ్మబోకుడి
ప్రియులారా-ఈ పాపమును చేయబోకుడి॥

1. పాపమును తెలుసుకొనె గ్రంథమున్నది -
గ్రంథమందు చదువుకుంటె వాక్యమున్నది ॥నరులార

2. ధర్మశాస్త్రమందు గొప్ప మర్మమున్నది-
ఆ మర్మమును తెలుసుకొంటె మోక్షమున్నది ॥నరులార

3. సైతాను బల్లమంత చాలయున్నది-
ఆ సైతానును నమ్ముకుంటె నరకమున్నది ॥నరులార

4. మనస్సునందు మనకు మంచి జ్ఞానమున్నది-
మరచిపోతె మనకు గొప్ప శాపమున్నది ॥నరులార

5. ఆదినుండి చేయుచున్న పాపమున్నది-
ఆ పాపమంత పరిహరించె ప్రభువున్నడు ॥నరులార

## 55

పల్లవి: యేసు ప్రభు మా కాశ్రయ దుర్గము-
భయమేల మనకింక ఈ భువిలో ॥యేసు ప్రభు

1. రాత్రిలో భయమునకు-పగటి బాణాలకు-
చీకట్లు కమ్మిన యేడసిల్లము ॥యేసు ప్రభు

2. శోధనలు కలిగిన-బాధలు కలిగిన
బంధకములు కలిగిన-భయపడము ॥యేసు ప్రభు

3. కొండలు పగిలిన-సముద్రాలు పొంగిన-
బండలు పగిలిన భయపడము ॥యేసు ప్రభు

4. ఏడువేల ఎడమప్రక్క పదివేలు కుడిప్రక్క-
కూలిన ధైర్యంబు చెడనియ్యము ॥యేసు ప్రభు

**56**

పల్లవి: యేసయ్యా నీ సిలువ యెంత ఘోరమయ్యా-
నాకొరకై వచ్చినావు నా కొరకే చచ్చినావు-
నన్నే రక్షించినావు-నా చక్కని యేసయ్యా॥

1. చక్కని ముఖమున రక్తపు చుక్కలు-దయగల
చేతులలో-కారేనే రక్తాలు-ప్రేమగల ప్రక్కలలో
పారేనే రక్తాలు కరుణగల కాళ్లతో కాలువలై కారేనే
॥యేసయ్యా

2. సిలువపై చూడలేను-చేతులందించలేను-
హృదయంబు పైకెత్తి-శిరము క్రిందికివంచి-
పాదములే మొక్కెదను-పాపినో యేసయ్యా ॥యేసయ్యా

3. ఎందరో బోధకులు-ఎన్నో చెప్పినగాని-
ఏమోననుకొంటిని-నేను నిన్ను కానకుంటిని-
సిలువపై చూచితినే-చిత్రింబగు నీ ప్రేమ ॥యేసయ్యా

**57**

పల్లవి: కన్య కుమారునిచెంత కలిగెయొకతె
చేరుకొని-ఉన్న పాపము లొప్పుకొనెరా-
నా చిన్ని చెలియ-ఉత్తముని దరిచేరెరా॥

1. నూరు రూపాయలు తెచ్చి-నడుముకొంగునగట్టి
అంగడికి తానుబోయెను-నా చిన్ని చెలియా-
అత్తరు బుడ్డిని గొనెనురా ॥కన్య

2. అత్తరు బుడ్డిని-యేసు మెత్తని పాదమున
మీదఁబోసి-చిత్తశుద్ధి-తానుగోరును -
నా చిన్ని చెలియా-ఉత్తముని దరిచేరెను ॥కన్య

3. వెనుక నిలువబడి-చెలియ యేసు పాదములఁబడి
యేడ్చి కంటిధారలతోను-నా చిన్ని చెలియా
యేసు పాదము ముద్దు బెట్టెను ॥కన్య

4. ముద్దుబెట్టి యేసుపాదము ముంగురులతోను తుడిచి
హద్దులేని ధనమాయెను-నా చిన్ని చెలియా -
వంగి వంగి ముద్దుబెట్టెను ॥కన్య

5. ఎన్నలేని పాపములు-యేసు మన్ననంబుచేసి-
ఎంతమంచిగ సాగనంపెను-నా అన్న యేసుకు-
ఎట్టి చిత్రమైన ప్రేమరా ॥కన్య

# 58

చాయ=శ్రీ యేసయ్యా సిలువ వెలుగు

1. కరుణగల తండ్రి దేవా-కనికరించు కష్టమందు ॥కరుణగల
2. ఆపత్కాలమందు నీవే-ఆదరించె తండ్రివయా ,,
3. కష్ట బాధలన్నిటిని-కడతేర్చె తండ్రివయా ,,
4. నీ సహాయకుండ నేనే-నిన్ను బలపర్తు నేనే ,,
5. నీవు నా దాసుండవనియు-నిన్ను ఆదుకొందుననెను ,,

6. భయపడకుడి మీరు-భీతి బాపుదేవుండవనెను ॥కరుణగల
7. తల్లి దండ్రులు విడిచినను-తండ్రి మమ్ము విడువవయ్యా ,,
8. బంధువులు మరచినను-నీవు మమ్ము మరువవయ్యా ,,
9. తెగులురాదు బుగులుపడకు-నను నమ్మికొనియుండుము,,
10. ప్రియాసపడి-భారము మోయు-వారలారారండనెను ,,
11. విశ్రాంతి నిన్ను నేనే విశ్వముతో నేనే మీకు ,,
12. పాపబరువు దించివేయు పరమ తండ్రి నేనేననెను ,,

## 59

పల్లవి: లేరా ఓ క్రీస్తుకుమారా రారా మన మార్గమేదిరా॥

1. సిలువ జండా చేతబట్టి-నీ తులువ బుద్ధి చితుగగొట్టి ॥లేరా
2. యిరుకు మార్గమి దేగదరా-స్వర్గమార్గమిదె పోవలెరా ॥లేరా
3. మాటచే చేరలేమురా మనస్సుతోడ నడిచి చేరవలెనురా ॥లేరా
4. పాపములను చేయరాదురా-ప్రభు యేసు నిన్ను మెచ్చలేడురా ॥లేరా
5. బొమ్మపూజ చేయరాదురా-బొమ్మపూజ నరకమునకు నడుపునురా ॥లేరా
6. అన్నియిచ్చె కన్నతండ్రిరా-కండ్లు తెరచి కనుము యిపుడేరా ॥లేరా
7. కలువరిగిరి సిలువ నొందిన-మన కన్నతండ్రి యేసు క్రీస్తేరా ॥లేరా

## 60

పల్లవి: మామీద దయలుంచు మాయేసు నాధుడా -
మమ్మెప్పుడు రక్షించు మా యేసు నాధుడా॥

1. నీ ప్రార్థన జేయ మా యేసు నాధుడా=
నీతిగల మనసునియ్యు మా యేసు నాధుడా ॥మామీద
2. దుష్టతలంపులన్ని మా యేసు నాధుడా =
దూరంబు జేయుమయ్యా మా యేసు నాధుడా ॥మామీద
3. పాప కూపమునుండి మా యేసు నాధుడా =
లేపి కాపాడుమమ్ము మా యేసు నాధుడా ॥మామీద
4. కష్టాసాగరమునుండి మా యేసు నాధుడా=
కరుణ కాపాడు మా యేసు నాధుడా ॥మామీద
5. దీవించ దిగిరమ్ము మా యేసు నాధుడా =
దీనుల మొరలువిని మా యేసు నాధుడా ॥మామీద

## 61

పల్లవి: యేసురాజ నీవేక కుమారుడవు
యేక కొమరుడవు లోక రక్షకుడవు॥

1. పరిశుద్ధమంతుడవు పరమాత్మ రూపుడవు ॥యేసు
2. లోక పాపములు జయించి లోకుల రక్షించినావు ॥యేసు
3. నేనే మార్గము మరియు నేనే జీవమునంటివి ॥యేసు
4. నేనే లోకంబునకు నిజమైన వెలుగునంటివి ॥యేసు
5. నేనే పరలోకం విడిచి-దిగినయాహారమంటివి ॥యేసు
6. నన్ను నమ్మిన వారికి నా రాజ్యమిత్తునంటివి ॥యేసు
7. నన్ను నమ్మనివారికి నరకంబు సిద్ధమంటివి ॥యేసు
8. రాజాధిరాజ - రాజ్యమేలరావా
రాజులకు రాజువై - రయముగ రావయ్యా ॥యేసు

## 62

రాగము:- చల్లనిరాజా "స్టయిలు"

పల్లవి: కళ్లు తెరచి కనరా!
వాక్యం వళ్లు మరచి వినరా!
సర్వం నీకె బోధ పడురా ||కళ్లు

1. మేడలు, మిద్దెలు, నుండిన గానీ-
ధన సంపదలు గలిగిన గానీ-
యేసు వాక్యమున సాటిరావురా-
హెచ్చు తక్కువలివియే లేరా ||కళ్లు

2. నిజముగ నీవూ యేసు వాక్యమున
ఎప్పుడనకను వున్నావంటే
నీ ఆత్మాలో ఆయన యైనా-
ఎప్పుడైనను వుండును లేరా ||కళ్ళు

3. పాపులకొరకై ఉద్భవించెరా -
ఇరువదైదు డిశంబరునా -
నిజముగాను యేసు ప్రభువురా -
స్తోత్రము చేయర యెపుడుయైనను ||కళ్ళు

4. నిజముగనైనా యేసు వాక్యమును
వేరే అని భావించినవారికి -
ఎన్నటికైనా హామి తప్పదు -
యేసు వాక్యము తప్పదు లేరా ||కళ్ళు

5. యేసు వాక్యమును యెరిగితివైనా -
ఎప్పుడైనా నీవున్నావంటే -
ఏనాటికిని కొరతలేదురా -
నీవు నమ్మురా యేసు వాక్యము ॥కళ్ళు

## 63

రాజా! రాజా! విన్నావా "స్టయిలు"

పల్లవి: యేసూ యేసూ మా నాథా -
నీవు త్వరగా రావయ్యా -
నిజముగ నీవు యేసయ్యా -
పాపులకొఱకు రావయ్యా ॥యేసు

1. నిజముగ పాపులు నీ కొఱకైనను -
కాచుక నున్నరు రావయ్యా -
వారికి త్వరగా నీవైన -
దీవన లివ్వు మా తండ్రి ॥యేసు

2. ఈ లోకములో నీవే మాకని -
నమ్మియున్నరు యేసయ్యా -
నిజముగ నీవు యేసయ్యా -
జీవాధారము మా నాథా ॥యేసు

3. నీ వాక్యాలను యెపుడు యైనా -
పాఠింతుము యేసయ్యా -
నిజముగ నీవూ రావయ్యా -
మా తండ్రీ! మా నాధా ॥యేసూ

## 64

చాయ : జీవితమే సఫలమే

పల్లవి: యేసు మనకు ప్రభురా! యెపుడుయైనా
మనకురా! తండ్రియేరా ! అయన

1. హృదయ మందు మనమురా -
ఆయన నామము -
తలచినవారికి -
ఆయన ఆత్మరా -
నిజము మనకు ప్రభువురా ॥యేసు

2. ఆయన నిజముగా -
తలచినవారికి -
"అపుడు యిపుడు" అనకాను -
హృదయమందు వుందురా -
నిజమైన ప్రభువురా ॥యేసు

3. నిజముగాను మా ప్రభూ
పాపుల కొఱకును -
జాగులేక రావయ్యా
త్వరగా నీవు రావయ్యా -
మా కొరకు యేసయ్యా ॥యేసు

## 65

ధాయ: నీ పేరువిన్నా నీ రూపుకన్నా

పల్లవి: ఓ యేసునాథా - నా యేసునాథా -
నీ పేరు విన్నా! భళే! భళే! ॥ఓ యేసు

1. నిజముగ నీ పేరుతోనైనా
పాపము పోవును క్షణములో
నాకైన ప్రభువూ నీ మహిమలైనా
కలలో నాకు బోధించుము ॥ఓ యేసు

2. నాకైన ప్రభువు యెపుడుయైనా
ఈ లోకములో నా ఆత్మవే
నిజముగ ప్రభువూ నేనైన ప్రభువూ
నీ ఆత్మలోనుందు యెపుడైనను ॥ఓ యేసు

3. నేనైన ప్రభువు దూరముగాను
నా పాపముచే లోకులకు
ఇపుడైన ప్రభువూ నీ మోక్షముచే
ప్రజలతో నేనుంటి హాయిగాను ॥ఓ యేసు

## 66

పల్లవి: భయము జెందకు ఆత్మ ప్రభుని దలచి దిగులు పడక

1. పాపమందు మగ్నుడవై - ప్రబలి తిరిగి మరచి నను
పాపములు క్షమించు యేసు-పాదముల సేవింప నమ్మి

2. సిలువ రక్తమున మునిగి-శుద్ధుడవై నిలిచినావు బలుడు
యేసు ప్రేమ విలువ - ఎల్లలోకములను జాట ॥

3. పరిశుద్ధాత్మ నడుపుదలను - పెంపునొంది ప్రభుని
దెలుప ఎరుగని ప్రజలెల్లరకును- విరివిగాబోధింప నిలలో॥

4. ఆలయంబునందు విందు-అందుకొనుము ప్రభుని
దలచి అంత్య దినమునందు నిన్ను-చెంత జేర్చునభయమిచ్చె॥

5. పరమ యెరుషలేమునందు-స్థిర నివాసముతే కలవు
కరుణతోడ నిన్ను బిలచి - కృపతో చేర్చుకొనును
ప్రభువు॥

# 67

పల్లవి: యెంత ఆశ్చర్యకరుడు వోయన్నా యెంతలోను
మా యేసన్నాను ॥ఆ

1. యెంత పాపినైన యేసన్నా యేసన్న యెంత
గాను రక్షించుమన్నా యేసన్నా॥

2. ఆకలికొన్న వారికి అన్నము పేదల బీదలా బాధలు తీర్చినా.
స్వర్గమునకు ఒక మార్గము చూపినా సజ్జనుడు ॥యేసన్నా

3. కుంటివారికి కాళ్లు చేతులు కన్నులులేని కబోదులైననూ,
మన్ననతో నిలమంచిగా చేసినా మంచి ప్రభుడు ॥యేసన్నా

4. నా పాపమునకై నీచునివలెను సిలువనునొంది
చావును గెలచి మనకును మన దేవునికి మధ్యవర్తి ॥యేసన్న

## సృష్టి కర్తకు కృతజ్ఞత

**68**

రా—కాంభోజి. తా-ఆట

అన్ని కాలంబుల - నున్న యెహోవాని - న్నెన్నఁద
రంబయో - కన్న తండ్రి = వన్నె కెక్కిన మోక్షు - వాసాళి
సన్నుతు - లున్నతమై యుండ - మున్నె నీకు ॥ నన్ని॥

1. నిన్నుఁ బ్రకటన సేయ - నిఖిల లోకములను - బన్నుగఁ జేసిన-
బలుఁడ వీవె = యున్న లోకంబుల - నుడుగక కరుణాసం-
పన్నతతో నేలు - ప్రభుఁడ వీవె=అన్ని జీవుల నెటిఁగి -
యాహార మిచ్చుచు - నున్న సర్వజ్ఞుం - డవు నీవే= యెన్న
శక్యముగాక-యున్నలక్షణముల-సన్నుతించుటకు నేఁ-జాలు
దునా॥ యన్ని ॥

2. పుట్టింప నీవంచుఁ - బోషింప నీవంచు - గిట్టింప నీవంచుఁ -
గీర్తింతును = వట్టి పనికిమాలి - నట్టి మానవుల చే - పట్టి
మానవుల చే - పట్టి రక్షింపఁ బా - ధ్యుండ వంచు=దట్టమైన
కృపను-దరిఁ జేర్చ నాకిచ్చి-పట్టయి నిలిచియుండు - ప్రభుఁడ
వంచుఁ = గట్టడచేఁ గడ-ముట్టుదనుక నా - పట్టుకోలఁది
నిన్నుఁ - బ్రస్తుతింతు ॥నన్ని॥

3. కారుణ్యానిధి వీవు - కఠినాత్ముడను నేను - భూరిశుద్ధుఁడ వీవు-పాపి నేను = సార భాగ్యుఁడ వీవు-జగతిలో నాకన్న-దారిద్ర్యుఁడే లేఁడు - తరచి చూడ = సార సద్గుణముల - సంపన్నుఁడవు నీవు - ఘూర దుర్గుణ సం - చారి నేను= ఏ రీతి స్తుతియింతు-నే రీతి సేవింతు-నేర మెన్నక ప్రోవ-నెర నమ్మితి ॥ నన్ని ॥

## 69 దేవుని ప్రేమ

రా-జంఝూటి. (చాయ: ఏపుగాను సదయుడైన) తా-ఆది.

ఎంత ప్రేమ యెంత ప్రేమ యెంత ప్రేమయా -
దేవుఁ=డెంత గొప్ప ప్రేమ దై వెలుంగుచుండునే ॥యెంత॥

1. ఎంత లోతు ఎంత నిడివి యెంత విరివయా - దాని = నింత యంతయని వచించె మనుజుఁ డెవ్వడు ॥ ఎంత ॥

2. మనమునఁ దలపోయా నూహ కంద దెంతయుఁ-దానిఁ= జనువుఁగ జగమందుఁ బొగడ మాట లందవే ॥ యెంత ॥

3. దేవదూతలైన దానిఁ. జూడలేరట - యింక = దేవుఁడే తన సుతు నొసంగి ఇంత యది యనెఁ ॥ ఎంత ॥

4. ఇంత గొప్ప ప్రేమఁ జూప నూరకుందునే - ప్రభుని = చెంతఁజేరి సంతతంబు ప్రీతిఁ జేసెదఁ ॥ ఎంత ॥

## 70 త్రైక దేవుని స్తుతి

రా-శంకరాభరణము. తా-ఆట.

పరిశుద్ధ పరిశుద్ధ - పరిశుద్ధ ప్రభువా = వరదూత లైన నిన్ - వర్ణింపఁ గలరా ॥ పరిశుద్ధ ॥

1. పరిశుద్ధ జనకుఁడ - పరమాత్మరూపుడా = నిరుపమ బల బుద్ధి - నీతి ప్రభావా ॥ పరిశుద్ధ॥

2. పరిశుద్ధ తనయుఁడ - నరరూపధారుఁడ = నరులను రక్షించు - కరుణా సముద్రా ॥పరిశుద్ధ॥

3. పరిశుద్ధ మగు నాత్మ - వరము లిడు నాత్మ = పరమానంద ప్రేమ - భక్తుల కిడుమా ॥పరిశుద్ధ।

4. జనక కుమారాత్మ-లను నేక దేవా = ఘనమహిమ చెల్లును-దనర నిత్యముగాఁ ॥బరిశుద్ధ॥

## 71 క్రీస్తును స్తుతించుట

రా=ముఖారి. తా-త్రిపుట.

నీవు నా దేవుండవై యు - న్నావు యేసు నాథ యూవులఁ బ్రోవవే - నన్నుఁ - గావనే ॥ నీవు ॥

1. పాప మానవ - శాప భారము - నోపి సిల్వను బడిన క్షేమా-ధిపతి సర్వ-భూపతి ॥ నీవు ॥

2. శ్రేయమౌ కా - యంబు భక్తుల - కీయ సిద్ధముఁ జేయు యేసు నాయకా - మోక్ష - దాయకా ॥ నీవు ॥

3. జీవ మారెడి - త్రోవ నేఁబడి-చావనై యున్నాను పతిత-
పావనా - యాత్మ - జీవనా ॥నీవు॥

4. జాగుసేయక - బాగుసేయను - రాఁగదె నే ఘోర పాప-
రోగిని - దుఃఖ-భాగిని ॥నీవు॥

5. పాపమున నా-రూపు మాపితి-ప్రాపు నీవని నమ్మితిని నను-
లేపవా - కృపను-జూపవా ॥నీవు॥

## 72 యేసు ప్రేమను స్తుతించుట

రా- బిలహరి. తా-ఆట

వింతగలమా యేసు ప్రేమను - సంతసమున స్తుతిం
తును=పంతముఁగఁ దన ప్రాణమును పా - పులకు నియ్యను
వచ్చి సిలువను - జచ్చి నను రక్షించె నహాహా ॥వింత॥

1. ప్రీతిగల మా ప్రభుని కృప బహు - ప్రియముతోఁ
జాటింతును=సాధుగా నాకొఱకు సిలువను - చాల శ్రమల
భరించి చావు జ-యించినను రక్షించె నహాహా ॥వింత॥

2. పాడుఁడీ మా యేసు ప్రేమను - వేఁడుఁడీ మదిఁ
గూడుఁడీ=పాడుఁడీ తన దివ్యరక్తము - పాప క్రయముగ
నిచ్చి శాపముఁ - బాపి నను రక్షించె నహాహా ॥వింత॥

3. నిత్య జీవము నిందు నెమ్మది - నిరతముగ నాకియ్యను=
రక్తచెమటలు గార్చె నహాహా - నరక శాపముఁ ద్రుంచి
యాపద - నుంచి నను రక్షించె నహాహా ॥వింత॥

**73** రక్షకునియందలివిజయము

రా- సెహాన. తా- త్రిపుట.

విజయగీతముల్ పాడరే - క్రీస్తుకు జయ - విజయగీత ముల్ పాడరే = వృజినమంతటి మీఁద - విజయ మిచ్చెడు దేవ-నిజకుమారుని నామమున్ - హృదయములతో - భజన జేయుచునిత్యమున్ ॥విజయ॥

1. మంగళముగ యేసుఁడే - మనకు రక్షణ-శృంగమై మరి నిల్చెను-నింగిఁ విడిచి వచ్చెను - శత్రుని యుద్ధ-రంగమం దున గెల్చెను = రంగుమీరఁగఁ దన-రక్తబలము వలనఁ- పొంగు నణఁగఁ జేసెను - సాతానుని బల్ -క్రుంగ నలిపి చీల్చెను ॥విజయ॥

2. పాపముల్ దొలఁగింపను—మనలను దన స్వ - రూపంబుకు మార్చెను - శాపం బంతయు నోర్చెను - దేవుని న్యాయ- కోపమున్ భరించెను = పాప మెరుగని యేసు - పాపమై మనకొరకు - పాపయాగము దీర్చెను - దేవుని నీతిన్ - ॥విజయ॥

3. సిలువ మరణము నొందియు - మనలను దనకై - గెలువన్ తేచినవానికిఁ-చెలువుగన్ విమలాత్మని - ప్రేమనుమనలో - నిలువన్ జేసిన వానికిఁ = కొలువుఁ జేకుమెగాని - ఇలను మరువక వాని - సిలువ మోయుచు నీ కృపా - రక్షణ చాల - విలువ గల్ల దని చాటుచు ॥విజయ॥

## 74 యేసు గొఱ్ఱెల మంచి కాపరి

రా-కమాసు. తా-త్రిపుట.

ఇదిగో గొఱ్ఱెల కాపరి - సోదరులారా - యిదిగో గొఱ్ఱెల కాపరి తుదిఁగాన రాని బాధురవని నలసటఁ-నొదవు గొఱ్ఱెలనెల్ల - నొగిబిల్చి రక్షించు ॥నిదిగో॥

1. చెదరి పోయిన గొఱ్ఱెనై - దొడ్డికిఁ బోవ - ముదములేని వాఁడనై = మృదుమధురంపు ని - నద మాలింపక కర్త- కొదిఁగి యుండక మూఢ - హృదయుఁడ నైతిని ॥నిదిగో॥

2. దూరంబునకుఁ బోతిని - జనకున కృపా - సారంబుఁ గొన్నైతిని = కారు మూర్ఖపుఁ బిల్ల - గా సంచరించి నా- కూరిమి యిలుఁజూసి - దారిఁ దొలఁగిపోతి ॥నిదిగో॥

3. ప్రాణావసర మప్పుడు -నేకాకినై - క్షీణించి యున్నప్పుడు= త్రాణార్థమగు నెవరు -త్రాళ్ళతో నను గట్టి - నాటెం బుగాఁ దెచ్చి - నన్ను రక్షించెను ॥ఇదిగో॥

4. ప్రభు యేసు నా కాపరి - యితఁడె భూమి- నభము లేలెడి నేర్పరి= శుభమైన తన దివ్య - శోణిత మొసఁగి య- విభుఁడు ప్రేమించి దీ-వించి స్వస్థముఁ జేసె ॥నిదిగో॥

## 75 యేసు నామ భజన

రా-హిందూస్థాని తోడి. తా-ఆది.

భజనచేయుచు భక్తపాలక-ప్రస్తుతింతు నీ నామమును=
వృజినములపైజయమునిచ్చిన-విజయుఁడా నిను వేఁడుకొందు॥

1. దివ్యపదవిని విడిచి నీవు - దీనుఁడవై పుట్టినావు = భవ్యమైన బోధలెన్నో - బాగుగా ధర నేర్పినావు ॥భజన॥

2. నరులఁ గావను పరమునుండి-ధరకు నీవు వచ్చినావు = పరుఁడనైన నాకొరకు నీ - ప్రాణము నర్పించినావు ॥భజన॥

3. చెడినవాఁడనైన నన్నుఁ-జేరఁదీసి ప్రోచినావు = పడిన నాదు గోతినుండి-పైకి లేవనెత్తినావు ॥భజన॥

4. ఎంత ప్రేమ యెంత దయ - యెంత కృప యేసయ్యా నీకు = ఇంతయని వర్ణింప నిలలో - నెవనికిని సాధ్యంబు కాదు ॥భజన॥

## 76 క్రీస్తు సంపూర్ణతయందు సంతోషించుట

రా-నాట. (చాయ: యెహోవా మా తండ్రిగాఁడ.) తా-ఆట

యేసు క్రీస్తు దొరికె నేని - యేమికొదు మింకేమి భయము = దోసకారి జనుల కెంతో - గ్రాస మవు నా యేసు పేరు ॥యేసు॥

1. తల్లిదండ్రులకన్న చాలఁ దన ప్రేమ మనమీదఁ=దప్పకుండ నుంచు పరమ - తండ్రియౌ నా యేసుఁ డేను ॥ యేసుఁ

2. వల్లగాని వశములేని - యెల్లమేళ్ల నెల్లప్పుడున్ = గొల్లగా మన కిచ్చు దేవ - కొమరుఁడే వేరెవరు లేరు ॥ యేసు ॥

3. దంట్రిదైన గండములు - మెండుగ మమ్ములఁ జుట్టిన= తండ్రివలె మా దరికి వచ్చి - గండములను గదిమి ప్రోచు ॥యేసు॥

4. సత్యము మార్గము తానే-నిత్య జీవ మింక తానే = ముక్తి మన కియ్యఁ దన - రక్తమంత కార్చినాడు ॥యేసు॥

5. ఎన్నరాని పాపాత్ములఁ-గన్నులారా కనికరించు = పున్నె మైన తన ప్రాణము-భూవిలో బలి పెట్టినాఁడు ॥యేసు॥

## 77 యేసుని ప్రేమ స్మరణ

రా-శంకరాభరణము. తా-ఆది.

యేసుని ప్రేమను - నేమారకను - నెప్పుడు దలఁచవే యో మనసా = వాసిగ నాతని - వరనామంబును - వద లక పొగడవె యో మనసా॥

1. పాపులకొరకై - ప్రాణముఁ బెట్టిన - ప్రభు నిలఁ దలఁచవె యో మనసా = శాపము నంతయుఁ- జక్కఁగ నోర్చిన- శాంతుని పొగడవె యో మనసా ॥యేసుని॥

2. కష్టములలో మన - కండగ నుండిన - కర్తను దలచవె యో మనసా = నష్టము లన్నియు - నణచిన యాగురు- శ్రేష్ఠుని పొగడవె యో మనసా ॥యేసుని॥

3. మరణతటిని మన - శరణుగ నుండెడు-మాన్యునిఁ దలఁచవె యో మనసా = కరుణను మన కన్నీటిని దుడిచిన-కర్తను పొగడవె యో మనసా ॥యేసుని॥

4. ప్రార్థనలు విని-ఫలముల నొసగిన-ప్రభు నిఁకఁ దలఁచవె యో మనసా = వర్ధనఁ గోరుచు - శ్రద్ధతో దిద్దిన-వంద్యుని పొగడవెయో మనసా ॥యేసుని॥

5. వంచనలేక - వరముల నొసఁగిన వరదునిఁ దలఁచవె యో మనసా = కొంచెము కాని - కూర్మితో దేవుని - కొమరుని పొగడవె యో మనసా॥ యేసుని॥

## 78 క్రీస్తు జన్మము

రా-బిలహరి. తా-త్రిపుట.

చింత లేదిఁక యేసు పుట్టెను - వింతగను బేత్లెహేమం దునఁ = చెంత జేరను రండి సర్వజనాంగామా - సంతస మొందుమా ॥చింత॥

1. దూత తెల్పెను గొల్లలకు శుభ - వార్త నా దివసంబు వింతగా = ఖ్యాతి మీరఁగ వారు యేసును గాంచిరి - స్తుతు లొనరించిరి ॥చింత॥

2. చుక్కఁ గనుగొని జ్ఞాను లెంతో - మక్కువతో నా ప్రభుని గనుగొన = చక్కఁగా బేత్లేహేమునను జొచ్చిరి - కానుక లిచ్చిరి ॥చింత॥

3. కన్యగర్భమునందుఁ బుట్టెను - కరుణగల రక్షకుడు క్రీస్తుఁడు= ధన్యు లగుటకు రండి వేగమె దీనులై - సర్వమాన్యులై ॥చింత॥

4. పాప మెల్లను బరిహరింపను - బరమ రక్షకుఁ డవతరించెను= దాపుఁ జేరిన వారి కిడుఁ గడు భాగ్యము - మోక్ష భాగ్యము ॥చింత॥

## 79 క్రీస్తు జీవితము

రా-ఆనందభైరవి. తా-కురుజంపె.

దేవుని ప్రేమ యిదిగో - జనులారా - భావంబునం దెలియరే = కేవలము నమ్ముకొనినఁ - బరలోక - జీవంబు మన కబ్బును ॥దేవుని॥

1. సర్వలోకము మనలను - తన వాక్య - సత్యంబుతోఁ జేసెను = సర్వోపకారు డుండే - మన మీద -జాలిపరుఁడై యుండెను ॥దేవుని॥

2. మానవుల రక్షింపను - దేవుండు - తన కుమారునిఁ బం పెను=మన శరీరముఁ దాల్చెను - ఆప్రభువు - మన పాప ముకు దూరుఁడే ॥దేవుని॥

3. యేసు క్రీస్తను పేరున - రక్షకుఁ - డు వెలసి నాఁడిలలో పల = దోసకారి జనులతో - నెంతో సు - భాషలను బల్కి నాఁడు ॥దేవుని॥

4 పాపభారంబు తోడ - నే పొర్లిద్దు - ప్రయాసములఁ బొం
దెడి = పాపులందఱు నమ్మిన - విశ్రాంతి - పరిపూర్ణమిత్తు
ననెను ॥దేవుని॥

5 సతులైన పురుషులైనన్ - యా కర్త సర్వ జనుల యెడ
లను = సత్ప్రేమగ నడిచెను - పరలోక సద్బోధలిక
జేసెను ॥దేవుని॥

6. చావు నొందిన కొందఱిన్ -యేసుండు - చక్కఁగా బ్రతి
కించెను = సకల వ్యాధుల రోగులు-ప్రభు వంటి- స్వస్థంబు
తా మొందిరి ॥దేవుని॥

7. గాలి సముద్రపు పొంగులన్ - సద్దణపి - నీళ్లపై నడచి
నాఁడే = మేలుగల యద్భుతములు - ఈలాగు - వేల
కొలఁదిగ జేసెను ॥దేవుని॥

8. చేతులను కాళ్లలోను - రా రాజు - చేర మేకులు బొం
దెను = పాతకులు గొట్టినారే - పరిశుద్ధ - నీతి తా
మోర్వలేకన్ ॥దేవుని॥

9. ఒడలు రక్తము గారగఁ - చెడుగు లందఱుఁ గొట్టిరి =
వడిముళ్లు తలమీఁదను-బెట్టిరి ఓర్పెనో రక్షకుండు ॥దేవుని॥

10. ఇన్ని బాధలు బెట్టుచుఁ - దనుఁ జంపు - చున్న పాప
నరులను = మన్నించు మని తండ్రిని-యేసుండు-సన్ను
తితో వేఁడెను ॥దేవుని॥

11. రక్షకుఁడు శ్రమఁ బొందఁగా-దేశంబు-తత్క్షణము చీఁకట
య్యేన్= రక్షకుడు మృతి నొందఁగఁ-దెర చినిఁగి-రాతి
కొండలు పగిలెను॥ దేవుని॥

12. రాతి సమాధిలోను-రక్షకుని-నీతిగల దేహంబును = కాఁతి పెట్టిరి భక్తులు-నమ్మిన-నాతు లందఱుఁ జూడఁగా ॥దేవుని॥

13. మూఁడవ దినమందున-యేసుండు-మృతి గెల్చి లేచి నాఁడు=నాఁడు నమ్మిన మనుజులు-చూచిరి-నలువది దినము లందున్ ॥దేవుని॥

14. పదునొకండు మారులు - వారలకుఁ- బ్రత్యక్షుఁ డాయె నేసు=పరలోకమున కేగెను - దన వార్తఁ - బ్రకటించు మని పల్కెను ॥దేవుని॥

15. నమ్మి స్నానము పొందెడి -నరులకు - రక్షణ మరి కల్గును= నమ్మ నొల్లక పోయెడు - నరులకు - నరకంబు సిద్ధమనెను ॥దేవుని॥

## 80 వ్యాధిబాధితురాలిని స్వస్థపర్చుట

రా-ఆనందభైరవి (చాయ:దేవుని ప్రేమ యిదిగో.) తా-కురుజంపె.

యేసు వస్త్రపు చెంగును - మాత్రమే - యాసించి ముట్టినట్టి = దోసకారుల రోగముల్ - వెంటనే తొలఁగి పోయెను నిజముగ ॥యేసు॥

1. గుంపుకూడిన జనులతోఁ - బ్రభు యేసు - సొంపుతోఁ బోవునపుడు = తెంపుతో రమణి యొకతె - ప్రభు చెంగు-తెలియకుండను ముట్టెను ॥యేసు॥

2. అంతటను రక్తధార - యామె కొ-కింతైన లేక పోయె= నింతలోఁ బ్రభువు ఎఱిఁగి - తనయొక్క - వింతఁ జూపెను జనులకు ॥యేసు॥

3. ప్రజలార మీలో నొకరిన్ - నాదు ప్ర- భావంబు స్వస్థ పరచె=నిజమంచుఁ బ్రభువు చెప్ప - వణఁకుతో - గజయాన వచ్చి నిల్చె ॥యేసు॥

4. ఒదుగుచుండిన వనితతో - శ్రీ యేసు - అదురు మానుమి యింకను = ఇదిగో నీ విశ్వాసము - రక్షించె - ముదిత నెమ్మదిని వెళ్లు ॥యేసు॥

5. ఏపుమీరగ యేసును - మీయొక్క - ప్రాపుగా నమ్మి కొనుఁడి = ఆపదలు దొలఁగించును - నిజముగఁ - బాప ముక్తులఁ జేయును ॥యేసు॥

## 81 క్రీస్తుని శ్రమల ధ్యానము

రా-కాంభోజి. తా-రూపకము.

రాజులకు రాజైన యీ - మన విభుని - పూజసేయు టకు రండి = యీ జయశాలి కన్న - మన కింక - రాజె వ్వరును లేరని ॥రాజులకు॥

1. కరుణ గల సోదరుండై-యీయన-ధరణి కేతెంచె నయ్యా= తిరముగా నమ్మికొనిన - మన కొసఁగుఁ - బరలోక రాజ్య మ్మును ॥రాజులకు॥

2. నక్కలకు బొరియ లుండె - నా కాశ - పక్షులకు గూళ్లుం డెను = ఒక్కింత స్థలమైనను - మన విభుని - కెక్కడ లేకుండెను ॥రాజులకు॥

3. అపహాసములు సేయుచు - నాయన - యాననము పై
నుమియుచుఁ గృప మాలిన సైనికు - లందరు - నెపము
లెంచుచుఁ గొట్టిరి ॥రాజులకు॥

4. కరమునం దొక్క రెల్లు - పుడకను - దిరముగా నునిచి
వారల్ =ధరణీపతి శ్రేష్ఠుఁడా - నీకిపుడు - దండ మనుచును -
మ్రొక్కిరి ॥రాజులకు॥

5. ఇట్టి శ్రమలను బొందిన - రక్షకునిఁ - బట్టుదలతో నమ్మిన=
నట్టహాసము తోడను - బరలోక - పట్టణంబున జేర్చును
॥రాజులకు॥

6. శక్తిగల రక్షకుండై - మన కొరకు - ముక్తి సిద్ధము॥
జేసెను = భక్తితోఁ బ్రార్థించిన - మన కొసఁగు - రక్తితో
నా ముక్తిని ॥రాజులకు॥

7. త్వరపడి రండి రండి - యీ పరమ - గురుని యొద్దకు
మీరలు = దరికిఁ జేరిన వారిని - నీ ప్రభువు - దరుమఁ
డెన్నఁడు దూరము ॥రాజులకు॥

## 82 సిలువమీఁది క్రీస్తు

రా—హిందూస్తాని కాపి. తా—మిశ్రపుట

చూడరే సిలువను బ్రే - లాడు యేసయ్యను = పాడు
లోకంబునకై -గోడు జెందెఁ గదా ॥చూడరే॥

1. నా చేతులు చేసినట్టి - దోషంబులే గదా = నా రాజర
చేతులలో ఘోరంపు జీలలు ॥చూడరే॥

2. దురితంపు దలఁపులే - పరమగురుని శిరముపై = నెనరు లేక
మొత్తెనయ్యో - ముండ్ల కిరీటమై ॥చూడరే॥

3 పరుగెత్తి పాదములు - చేసిన పాపంబులు=పరమ రక్షకుని-
పాదములలో మేకులు ॥చూడరే॥

4. పాపేచ్ఛ తోడఁ గూడు - పడక లేగద నాదు=పరమగురుని
ప్రక్కలోని - బలెంపు పోటులు ॥చూడరే॥

## 83 యేసునొద్దకు రండి

రా—మధ్యమావతి. తా—ఆది

రండి యేసునియొద్దకు - ప్రియులారా మీరు - రండి
యేసునియొద్దకు= రండి రండి యని - రయమున బిలుచుచు
నుండెడి రక్షకుఁ - డొసఁగెను ప్రాణము ॥రండి॥

1. మీరు పాపంబులఁ దృజించి - యేసుని కడకు-రారే వేగము
విశ్వసించి=మీరు వచ్చినను-మిమ్మును ద్రోయఁడు - చేరెడు
వారిని - జేర్చును దన దరి ॥రండి॥

2. మీకు బ్రతు కేమి శాశ్వతము - ప్రియ జనులారా - పోకుఁ
డాశించి లోకమును = లోకాశలకును - లొంగుట చేతను-
మీకు ఘటిల్లును - మెండగు దుఃఖము ॥రండి॥

3. మీరేల జాలము చేసెదరు - ప్రియులారా వేగ - రారే
కడు భాగ్య మొందెదరు=చేర వచ్చి చిర-జీవము నొందుఁడ-
పార ముదంబును - బడయఁగ దేవుఁడు ॥రండి॥

## 84 గ్రామ సాక్ష్యము

(చాయ: "జనన మొందెగా - ఘనుఁడైన యేసు")

రా—హిందూస్తాని ముఖారి. తా.—ఝుల్ప

సాక్ష్య మిచ్చెద - మన - స్వామి యేసు దేవుఁ డంచు=
సాక్ష్యమనఁగఁ గనిన వినిన - సంగతులను దెల్పుటయే -
సాక్ష్య మిచ్చుకొరకు నన్ను-స్వామి రక్షించె నంచు ॥సాక్ష్య॥

1. దిక్కు దెసయు లేని నన్ను - దేవుఁ డెంతో కనికరించి =
మక్కువతో నాకు నెట్లు-మనశ్శాంతి నిచ్చినాఁడో ॥సాక్ష్య॥

2. పల్లెటూళ్ళ జనుల రక్షణ - భారము నాపైని గలదు=
పిల్లలకును బెద్దలకును-ప్రేమతో నా స్వానుభవము ॥సాక్ష్య॥

3. బోధ చేయ లేను వాద - ములకుఁ బోను నాక దేల =
నాధుఁడేసు ప్రభుని గూర్చి-నాకుఁ దెలిసినంత వరకు ॥సాక్ష్య॥

4. పాపులకును మిత్రుఁ డంచుఁ-ప్రాణ మొసఁగి లేచె నంచుఁ=
పాపముల క్షమించు నంచుఁ ప్రభుని విశ్వసించుఁ డంచు॥సాక్ష్య॥

5. చోరులైన జారులైనా చారులైన నెవ్వరైన=ఘోరపాపు
లైన గ్రీస్తు - కూర్మితో రక్షించు నంచు ॥సాక్ష్య॥

6. పరమతదూషణము లేల - పరిహసించి పలుకు లేల=ఇరుగు
పొరుగు వారి కెల్ల-యేసు క్రీస్తు దేవుఁ డంచు ॥సాక్ష్య॥

7. ఎల్లకాల మూరకుండ - నేల యాత్మ శాంతిలేక=తల్లడిల్లు
వారలకును - తండ్రి కుమారాత్మ పేర ॥సాక్ష్య॥

## 85 క్రైస్తవ పశ్చాత్తాపము

రా—అఠాణ తా—ఆది.

రావయ్యా యేసునాథా - మా - రక్షణ్యమార్గము - నీ=
సేవఁ జేయ మమ్ముఁ - జేపట్టుటకు ॥రావయ్యా॥

1. హద్దు లేక మేము - ఇల - మొద్దులమై యుంటిమి -మా =
కొద్ది బుద్ధులన్ని - దిద్ది రక్షింప ॥రావయ్యా॥

2. నిండు వేడుకతోను - మమ్ము - బెండువడక చేసి - మా =
గండంబులన్నియు - ఖండించుటకు ॥రావయ్యా॥

3. మేర లేని పాపము - మాకు - భారమైన మోపు - నీవు=
దూరంబుగాఁ జేసి - దారిఁ జూపుటకు ॥రావయ్యా॥

4. పాపులమయ్యా మేము - పరమ - తండ్రిని గానకను - మా=
పాపంబులన్నియుఁ - పారఁ దోలుటకు ॥రావయ్యా॥

## 86 యేసు తోడైయున్నఁ జాలు

రా—బిలహరి. తా—త్రిపుట.

నీవు తోడై యున్నఁజాలు - యేసు - నిత్యము నాకది
మేలు = నీవు ధరణినుండు-నీచపాపుల నెల్లఁ - గానఁ ప్రేమ
వచ్చి - ఘన ప్రాణ మిడినట్టి॥ నీవు॥

1. నినుఁ బోలు రక్షకుం డేడి - క్రీస్తు - ననుఁ బోలు పాత
కుండేడి = నిను నమ్ము వారలకు - నీవొసఁగుచుందువు -
తనరఁ జాపక్షమ - దయచేత నిలలోన ॥నీవు॥

2. నీపాటి బలవంతుఁ డేడి - ప్రభు - నాపాటి దుర్బలుం = డేడి కాపాడు చుందువు - కలకాలమున నీవు - నీ పాద సేవకుల- నీ నేర్పు రంజిల్ల ॥నీవు॥

3. నీవంటి యుపకారి యేడి - కర్త - నావంటి కడు దీనుఁడేడి= జీవులకును గల్గు - జీవంబు లిచ్చుచు - జీవాధారము లొసఁగి - జీవులఁ బ్రోచెడి ॥నీవు॥

4. నీవంటి ధనవంతుఁ డేడి - యేసు - నావంటి ధనహీనుఁ డేడి = ప్రోవులై యున్నవి - యీవులు నీయందు - నీవు వాని నొసంగి - నిరతంబు ననుఁ గావు ॥నీవు॥

## 87 యేసుని ప్రేమ

రా—ముఖారి. తా—ఆది.

నీవే నా ప్రియుఁడవు - యేసు ప్రభు - నీవే నా యొడయుఁడవు = నీవే యనాది - దేవ పుత్రుండవు - నీవే లోక మెల్ల - నేర్పుగఁ జేసితివి ॥నీవే॥

1. పరమందు నీ కుండు - పరమభాగ్యంబులు - నర కాయత్తుఁడ వైన - నాకొరకు విడిచితివి ॥నీవే॥

2. నీవే ననుఁ బ్రోవ - నెవరున నేతెంచి - నీవొలుక పోసితివి- నీ నల్ల సిలువపై ॥నీవే॥

3. నే నెవరిఁ బ్రేమింతు - నీకంటె లోకమున - నే నెపుడు మరవను - నీ ప్రేమ నా కర్త ॥నీవే॥

4. నీ సేవ నేఁ గోరి - నిన్నే ప్రీతిపరతు - నీ సేవకుఁడ నైన- నే నెట్లు నిను విడుతు ॥నీవే॥

5. సకలంబు నేలెడి - చక్కని రాజవు - సకలాధికారంబు - చక్కఁగఁ జేయుదువు ॥నీవే॥

6. నీ సేవకుల నెల్ల - నేర్పుగా నేలెదవు - నీ సేవకులు పొంద- నిత్య సహాయంబు ॥నీవే॥

## 88 క్రైస్తవానుభవము

రా—శంకరాభరణము. తా—ఆట.

యేసు నామం బెత్తి పాడుదమ = క్రీస్తు - దాసులతోఁ బొత్తుఁ గూడుదమ ॥యేసు॥

1. ఇహసంబంధుల పొందుఁ జాలింతమ = మహా - మహుఁడౌ దేవుని యాజ్ఞఁ బాలింతమ ॥యేసు॥

2. శుభవార్తార్థముఁ లన్ని శోధింతమ = యేసువిభుసత్యముల లో న - సుభవింతమ ॥యేసు॥

3. దోషములను బైటఁ బెట్టుదమ = కపట - వేష భాషలఁ గుప్పింగఁ బట్టుదమ ॥యేసు॥

4. మన రక్షకుని పాట్లు మది నెంతమ = మన - మనసులోపలి గర్వ మణుపుదమ ॥యేసు॥

5. జనుల నిందల కెల్ల నోర్చెదమ = బోధ - కనిపెట్టి ప్రభు చెంత నేర్చెదమ ॥యేసు॥

6. మానావమానముల్ భరియింతమ = యోర్వ - లేని గుణ ముల వేరుఁ బెరుకుదమ ॥యేసు॥

7. పరిశుద్ధాత్మను బొంద నడుగుదమ = బుద్ధి - పరమానం దము జూడ నడుపుదమ ॥యేసు॥

8. సకల మానవు లాత్మ సరిచూతమ = యింక - మొక మిచ్చ కపు మాటల్విడిచెదమ ॥యేసు॥

9. దినము ప్రార్థనఁ జేయ గురి యుంతమ = చెడ్డ - మనసు బద్ధకముపై నెదిరింతమ ॥యేసు॥

10. గురు బోధ స్థలికి బిరబిరఁ బోదమ = బుద్ధి - తీర ముంచి వాక్యార్థ మెరుఁగుదమ ॥యేసు॥

## 89 యేసునాథా, రమ్ము

రా—శహాన. తా—ఏక.

యేసునాథా రారారా–మా–జీవనాథా రారారా॥

1. దోసములు బాప నీవు - వాసిగ జన్మించినావు ॥యేసు॥
2. పీచులను పేర్మించి - నీ కరుణఁ జూపినావు ॥యేసు॥
3. నీతిలేని వారి కెల్ల - నిత్య జీవ మిచ్చినావు ॥యేసు॥

4. పొందరాని కష్టములను-బొంది యుంటివి తండ్రి ॥యేసు॥
5. లోకపాపములు జయించి-లోకుల రక్షించితివి ॥యేసు॥
6. వేడుకతోడ మేము - వేడుకొందు మో తండ్రి ॥యేసు॥

## 90 క్రీస్తు లేచెను

రా—నాధనామక్రియ. తా—రూపకము.

యేసు ప్రభువు లేచెను-మా-మీ-మన-ఆహా- చావు గెలిచి లేచెను-యేసు ప్రభువు లేచెను=యేసు క్రీస్తువలన మాకు-విజయ మిచ్చు తండ్రి దేవ-నిత్యంబు నీకే మా స్తోత్రము స్తోత్రము ॥యేసు॥

1. మరణమా నీ ముల్లు ఏది-మరణమా నీ విజయ మేది = పాపపు జీతమా మ్రింగఁబడితివి ॥యేసు॥
2. మౌన మైన దేశమందు - మౌనివై పరుండగను = నినోద బూరతోఁ బిల్చి లేపు ॥యేసు॥
3. మోక్షమందు మాకు స్థలము - అక్షయ క్షేమముగ నుండ= నాయిత్తపర్చఁగ ముందు వెళ్లె ॥యేసు॥
4. పరమ కానాను నందుఁ - జేర యోర్దానందు మాకు= మార్గదర్శిగ యేసు లేచె ॥యేసు॥
5. మా తండ్రి యింట మేము-నిత్యమును జేరి యుండ = నదృశ్యలోకము గెల్చి లేప ॥యేసు॥

## 91 క్రీస్తు కరుణయం దాశ్రయించుట

రా—ముఖారి: తా—అట

యేసు కరుణ - యిదియే మా శరణు - యేసు కరుణ॥

1. యేసుని కరుణ - యిదే మాకు శరణని-యాసతో నమ్మిన-యధములకెల్ల ॥యేసు॥

2. ఎన్నిక సేయక - యే పాపి నైనను - మన్నించి బ్రోచెడు-మా దేవుఁడైన ॥యేసు॥

3. పశ్చాత్తాపము నొందు - పాపుల నెల్లను - నిశ్చయముగఁ బ్రోవ - నిపుణుడై యున్న ॥యేసు॥

4. దిక్కు లేకున్నట్టి-దీన జనాత్ములఁ - జక్కఁగఁ బ్రోచెడు - సదయుఁ డై యున్న ॥యేసు॥

## 92 యేసునకు స్తుతి

రా—ముఖారి. (చాయ: దినదినములకు దిక్కు నీవే) తా—ఆది.

చేతు లెత్తి వందనములు - చేతు మిపుడే యేసు నీకు—రాతిరి పగలందు మమ్ముఁ- బ్రీతితోఁ గాపాడు యేసు ॥చేతు॥

1. సుఖమైనట్టి నిద్ర మమ్ము - నొందఁజేసి రాత్రియందు—సకల మేలు లందఁజేయు - స్వామి యేసు క్రీస్తా నీకుఁ ॥చేతు॥

2. అన్నవస్త్రములను మాకు - నన్ని వేళలందు నిచ్చి =
కన్న తండ్రివలెను బెంచు-చున్న యేసుస్వామి నీకే ॥చేతు॥

3. విద్యా బుద్ధులన్ని యిచ్చి-వింత వింత వరము లిచ్చి=పెద్దల
దయలోను మమ్ముఁ-బెంపారఁ జేయు మేసయ్యా ॥చేతు॥

4. చిన్నవారి స్నేహితుడుగ-నున్న యేసుస్వామీ నీకు =
ఎన్నో వేల స్తోత్రంబులు=నిలలో నెపుడు కలుగుగాక ॥చేతు॥

**93**

"నీవు నన్ను ఆశీర్వదింపనియెడల నిన్ను వెళ్లనియ్యను"

రా—తోడి. తా—రూపకము.

నిన్ను నేను విడువను దేవ-నీవు నను దీవించు వరకు=
నిన్ను నమ్మినవారల నెల్ల-నీవు చక్కఁగ దీవించెదవు ॥నిన్ను॥

1. నేను శత్రువునై యుండంగ - నీవు నాపై నెనరు జూపి=
దాన మిచ్చితివి నా కొరకు - దారుఁడౌ నీ ప్రియ పుత్రుని
॥నిన్ను॥

2. త్రోవ దప్పి తిరుగుచుండి - దుడుకునైన నన్నుఁ గాంచి=
పోవఁ గోరి మదిని నీవు - త్రోవను బెట్టితివి నన్ను
॥నిన్ను॥

3. నాఁటనుండి నేఁటి వరకు-నాకుఁ గల్గిన శోధనములలో =
నేటుగా ననుఁ గాచిన వాఁడవు-నీవు గావా యో నా
తండ్రి ॥నిన్ను॥

4. ఇంత కాలము నన్నుఁ గాచి - యిఁకను నన్ను విడువ
వనుచు = సంతసించి మదిని నేను - జక్కఁగ నీ దరిని
జేరితి ॥నిన్ను॥

5. నీవు గాక యెవ రున్నారు - నేలపైని ననుఁ గాపాడఁ =
చేవ లేని నాకు నీవు - చేవ గలుగఁ జేయఁ గలవు ॥నిన్ను॥

6. అడుగు వారి కిచ్చెద నంచు - నాన తిచ్చినావు గాన =
నడిగెద నిను సాహాయ్యంబు - నాత్మవై యున్నట్టి తండ్రి
॥నిన్ను॥

7. నాదు ప్రార్థన లన్నియు నీవు-నీదు కృపచే నాలకించి=నీదు
సరణిని నిల్పి నన్ను - నేర్పు దనరఁగ రక్షించితివి ॥నిన్ను॥

---

దైవ దర్శనానంతరము దైవ మహిమ వలన బాగుపడిన రోగుల సంఖ్య నీ క్రింద నుదహరించిన పథకంబున పొందుబరచుచున్నా రము పఠితలు గ్రహింతురుగాక.

— )o( —

ప్రభువు నామమున స్వస్థీకరింపబడిన రోగుల జాబిత

| వ. నెం. | గ్రామము పేరు. | నెం. | బాగైన వారు. |
|---|---|---|---|
| 1. | కొరిపల్లి | 150 | గ్రుడ్డి కుంటి |
| 2. | మంచివుప్పల | 150 | కుష్ఠు, నొప్పులు. |
| 3. | తమడపల్లె | 100 | వాయి, దగ్గు. |
| 4 | యల్లామల | 300 | కడుపునొప్పులు, కుష్ఠు, గ్రుడ్డి. |
| 5. | నిలిగొండ | 300 | వాయి, కుంటి. |
| 6. | చేరియాల | 150 | నొప్పులు, రక్త. |
| 7. | సిద్దిపేట | 400 | దగ్గు, గ్రుడ్డి. |
| 8. | కొండాపురము | 150 | నొప్పులు, కుంటి. |
| 9. | దూమాల | 80 | రక్త, వాయి, గుడ్డి, |

| వ. నెం. | గ్రామము పేరు. | నెం. | బాగైన వారు. |
|---|---|---|---|
| 10. | కొడిమల | 100 | దగ్గు, కుష్ఠ, కడుపునొప్పి. |
| 11. | దరూరు | 200 | కుష్ఠ, వాయి, గ్రుడ్డి. |
| 12. | కొరుట్ల | 150 | మూర్ఛ, గ్రుడ్డి, కుంటి, |
| 13. | ఆరేపేట | 300 | ఫలము, దగ్గు. |
| 14. | మల్లెలా | 100 | కుష్ఠ, గ్రుడ్డి, కుంటి. |
| 15. | గుత్తిపేట | 200 | వ్యాధులు |
| 16. | పచ్చిలినడికుడ | 200 | గుడ్డి, కుంటి |
| 17. | మారంపల్లి | 200 | రక్త, వాయి. |
| 18. | పెదకండెల | 100 | గుడ్డి. కుంటి. |
| 19. | జయిల | 200 | వాయి, దగ్గు, కుంటి. |
| 20. | సుసుందము | 300 | కుష్ఠ, గ్రుడ్డి, కుంటి. |
| 21. | ఝంబీలము | 400 | రక్త, కుంటి. |
| 22. | కిష్టాపురము | 400 | వాయి, కుంటి, రక్త. |
| 23. | సాతెల్లి | 300 | రక్త, వాయి. |
| 24. | పోతంన్ బెట్టిపల్లె | 200 | వాయి, నొప్పులు. |
| 25. | మెదక్ | 150 | గ్రుడ్డి, కుంటి. |
| 26. | హైదరాబాదు | 400 | దగ్గు, కుంటి, |
| 27. | కర్నూలు | 85 | మూర్ఛ, దగ్గు, కుంటి |
| 28. | నంద్యాల | 141 | వాయి, కుంటి. |

| వ నెం. | గ్రామము పేరు. | నెం. | బాగైన వారు. |
|---|---|---|---|
| 29. | గిద్దలూరు | 394 | గుడ్డి, కుంటి, రక్త |
| 30. | బోయలగుంట్ల | 162 | మూగ, దయ్యము. |
| 31. | శాబోలి | 164 | పక్షవాయి, గ్రుడ్డి, |
| 32. | గడివేముల | 469 | గ్రుడ్డి, రక్త. |
| 33. | గుంతకల్లు | 576 | గుడ్డి, వాయి, కుంటి. |
| 34. | రామకీర్తము | 661 | మూగ, కుంటి, గ్రుడ్డి. |
| 35. | ప్రొద్దుటూరు | 671 | కుంటి, కడుపు నొప్పి |
| 36. | పులివెందల | 639 | దగ్గు, వాయి, గ్రుడ్డి, |
| 37. | కదిరి | 500 | దగ్గు, వాయి, గ్రుడ్డి, |

**యేసు రక్తమునకే జయము**

ఇట్లు
ప్రభువునందు మీ ప్రేమగల
**శ్రీ సాధు యోసేపు**
కదిరి, అనంతపురము జిల్లా.